ఈ నాటి అమ్మాయిలు అబ్బాయిలకేమీ తీసిపోరు అని రుజువు చేసిన ఇద్దరు అమ్మాయిల కథ.....




సురేష్ ఇంటర్నేషనల్

# అమ్మాయిల శపథం

దర్శకత్వం: జి.వి.ఆర్. శేషగిరిరావు

నిర్మాతలు: డి. వెంకటేశ్వర్లు, బి. శకుంతలమ్మ

ఆంధ్ర-సీడెడ్: నవయుగ నైజాం: విజయా సురేష్ పిక్చర్స్

NVKR

ఆంధ్రసచిత్రవారపత్రిక

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 - 1972)
శుక్రవారం : 6–6–'75
రాక్షసనామ సం. వైశాఖమాస బ. ద్వాదశి
**సంపుటము : 68 సంచిక : 38**

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

★

సంవత్సర చందా – రు. 33–80 పై.
ఆరుమాసాల చందా – రు. 16–90 పై.
విడిప్రతి వెల 60 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ–520003.


## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ :
నటి శుభ
(ఫోటో: శ్రీ ఎస్. ఎస్. రావు)

**కథలు :**



**సీరియల్ కథలు :**



**వ్యాసాలు, శీర్షికలు :**

మద్రకారు కులాసాలకు విధివిలాసాలకు
విచిత్రమైన భేటీ










డి.వి.యస్. ప్రొడక్షన్స్

# జీవనజ్యోతి

ఈస్ట్‌మన్ కలర్

దర్శకత్వం:
కె. విశ్వనాథ్ B.Sc.

నిర్మాత:
డి.వి.యస్. రాజు

విజయ రిలీజ్

VIJAYA

# హైదరాబాద్ నోట్ బుక్

### కొత్త పోలీస్ ఇన్‌స్పెక్టర్ జనరల్

పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్ శ్రీ అబ్దుస్సలాం ఖాన్ ఏప్రిల్ 30 వ పదవీ విరమణ చేయడంతో శ్రీ కె రామచంద్రారెడ్డి పోలీస్ ఇన్‌స్పెక్టర్ జనరల్ పదవిని స్వీకరించారు శ్రీ రెడ్డి వయసు 54 సంవత్సరాలు 1943 లో ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో డిప్యూటీ పోలీస్ సూపరింటెండెంటుగాచేరి వివిధ పదవులు నిర్వహించి, విశిష్టమైన సేవకు రాష్ట్రపతి పతకం పొంది, యాంటీకరప్షన్ బ్యూరో డైరెక్టరుగా వుండి, ఇప్పుడు పోలీస్ ఇన్‌స్పెక్టర్ జనరల్‌గా నియమితులయ్యారు శ్రీ రెడ్డి ఎం ఎ, ఎస్ ఎల్ బి పట్టభద్రులు అవినీతి నివారణ కార్యక్రమంలో విశేషానుభవం పొందినవారు వీరి పదవీ కాలంలో నగరంలో అవినీతి అంతం కాగలదని నా ఆశ, హైదరాబాద్ పోలీసు శాఖ సేవా ప్రమాణం మరింత ఉన్నంతం కాగలదని నా విశ్వాసం

### విదేశ ప్రతినిధుల పరిచయ సంచిక

హైదరాబాద్‌లో మొన్నటి ఏప్రిల్ నెలలో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభలకు విచ్చేసిన విదేశ ప్రతినిధుల పరిచయ సంచిక రాజకీయ సాంస్కృతిక వాణిజ్య సంబంధాలు పెంపొందించుకొనడానికి ఎంతో ప్రయోజనకరంగా ఉంది దీనిలో ఇగ్లాండు, అమెరికా, కెనడా, పశ్చిమ జర్మని, ఫ్రాన్స్, శ్రీలంక, ఫిజీ, మారిషస్ బర్మా, మలేషియా ఇండోనీషియా, జాంబియా, దక్షిణాఫ్రికా, ఆఫ్ఘనిస్తాన్, రష్యా, సింగపూర్, బంగ్లాదేశ్‌లనుంచి వచ్చిన దాదాపు 70 మంది ప్రతినిధుల పరిచయం వారి ఛాయా చిత్రాలతో సహా ఇవ్వబడింది మహాసభల కార్యదర్శి, విదేశ ప్రతినిధుల సౌకర్యాల ప్రత్యేకాధికారి శ్రీ ఎస్ వి ఎస్ ప్రసాదరావు పరిచయం ముందుమాటలో అన్నట్టు "ఎంతోకాలం క్రిందట ప్రపంచంలోని వివిధ దేశాలకు వలస వెళ్లి అక్కడ స్థిరనివాసం ఏర్పరచుకొని ఆయా ప్రాంతాల భాష, సంస్కృతి, సంప్రదాయాలను జీర్ణించుకొన్నా, తమ తెలుగుభాషను, ఆచార వ్యవహారాలను పదిలంగా కాపాడుకుంటూ వచ్చిన "తెలుగు వారితో మనం మైత్రిని దృఢతరం చేసుకొనడానికి ఈ పరిచయ సంచిక ఎంతో ఉపయోగకరం.

### సంజీవయ్య స్మారకోద్యానం

జీవించి ఉంటే, భారత రాష్ట్రపతి కాదగినవాడు, సహృదయుడు, దళిత జాతుల నాయకుడు అయిన శ్రీ దామోదరం సంజీవయ్య స్మారకారామానికి ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు మే 7 వ తేదీన ప్రారంభోత్సవం జరిపారు ఈ ఆరామంపాటిగడ్డలో 80 ఎకరాల ప్రాంతంలో నిర్మించబడుతుంది ప్రారంభోత్సవం శ్రీ సంజీవయ్య తృతీయ వర్ధంతినాడు జరిగింది "శ్రీ సంజీవయ్య ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు ఈ 80 యకరాల ప్రాంతంలో సచివాలయభవనం నిర్మించాలని సంకల్పించబడింది అదే ప్రాంతంలో నేడు సంజీవయ్య స్మారకారామానికి ప్రారంభోత్సవం జరుగడం ఎంతో బాగుంది" అన్నారు ముఖ్యమంత్రి ఈ ఆరామంలో స్మారక చిహ్నం, గ్రంథాలయం, మొదనయినవి నిర్మించబడుతాయి మంత్రులు శ్రీ బసిరెడ్డి, డి. మునుస్వామి, రాయలసీమ అభివృద్ధి సంఘాధ్యక్షులు శ్రీ నరసప్ప శ్రీ సంజీవయ్య గుణగణాలను స్మరించారు మునిసిపల్ కార్పొరేషన్ స్పెషల్ ఆఫీసర్ శ్రీ నరేంద్ర లూథర్ ధన్యవాదాలర్పిస్తూ ఈ స్మారకారామం త్వరలోనే పూర్తవుతుందని లన్నారు

### ప్రపంచ విజ్ఞానసమితి సహాయం

ప్రపంచ తెలుగు మహాసభ పర్యవసానంగా నెలకొల్పదలచిన అంతర్జాతీయ తెలుగు అధ్యయన సంస్థకు ప్రపంచ విజ్ఞాన సమితి ఆర్థిక సహాయంకోరుతామని విద్యామంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు మే 6 వ తేదీన పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో తెలిపారు ఈ మహాసభ హిందీ తర్వాత తెలుగే అధిక సంఖ్యాక భాషావర్గమని దేశానికే కాక ప్రపంచానికే చాటిందన్నారు రాష్ట్ర ప్రభుత్వం ఈ అంతర్జాతీయ సంస్థ కోసం మూడు లక్షల రూపాయలు ఇదివరకే కేటాయించింది.

### ఉపశ్రుతి!

"కండక్టర్ సాబ్, చార్‌మినార్‌కో కిత్‌నే పైసే ?" "ఇరవై అయిదు పైసలయ్యా ?" "క్యాకీ" "ఇరవై పైసలయ్యా," ఇలా సాగుతున్నది సంభాషణ బస్సులో "ఆయన హిందీలో అడిగితే తెలుగులో సమాధానం చెబుతావేమయ్యా ?" అన్నారు కండక్టరుతో "అవును సార్ ఇదితెలుగు సంస్కృతి సంవత్సరం మొన్ననే మహాసభలు జరిగాయి తెలుగులోనే మాట్లాడమని ముఖ్యమంత్రిగారి సందేశం "అని సమాధానమిచ్చాడు కండక్టర్.

—తిరుమల రామచంద్ర

## ఉత్తరాలు

### "ఆర్యభట"

16—5—75 నాటి పత్రికయందు "అంతరిక్షంలో ఆర్యభట్" అనువిజ్ఞానదాయకమైన విషయమును, మాకు తెలియని విజ్ఞాన విషయాలు తెలిపినారు ప్రతివారము ఇలాగానే ఏదో ఒక విజ్ఞాన విషయమును ప్రచురించవలెనని మా ప్రార్థన కె. సుంకయ్యగుప్త, అనంతపురము

* * *

16—5—75 పత్రికలో "అంతరిక్షంలో ఆర్యభట్" వ్యాసంచాలా బాగుంది "మన దేశంలో ప్రభుత్వం వారి సమాచార యంత్రాంగం, పత్రికలు, ప్రజలు కూడా రాజకీయాలకు ఇచ్చిన ప్రాధాన్యత ఇతర సాంకేతిక రంగాలకు ఇవ్వడం లేదు" అన్నారు నిజమే, పత్రిక రాగానే శ్రీవాన్ 'సినిమాలు', సీరియల్స్, రామలక్ష్మి ప్రశ్నలు, గంగబా క్రిప్పే పాఠకుల మనస్తత్వం మారాలి దానితోటే అవే లేకుంటే పత్రిక సర్క్యులేషన్ పెరగదు అనే పత్రిక నిర్వాహకుల మనస్తత్వం కూడా మారాలి సీరియల్స్ సినిమాలు వుండవలసిందే కాని వానితోటే కాస్త విజ్ఞానదాయకమైన వార్తలకు మరికొన్ని పేజీలు కేటాయించండి అప్పుడు సామాన్యుడు సైతం మన దేశ శాస్త్ర సాంకేతిక రంగాల ప్రాధాన్యత తెలుసుకో గలుగుతాడు

ఆర్ యమ్. యస్ ప్రకాష్‌బాబు
సూళ్ళూరుపేట

### కథలు

"ప్రేమించిచూడు" కథ ఈనాటి యువకులకు, కనువిప్పు కలిగేలా రచించారు ఎం పి ఆర్ రాధాకృష్ణగారు వారికి మా ధన్యవాదములు

పి వి రామనాథపిళ్ళేకారన్ ఖమ్మం

* * *

16—5—'75నాటి పత్రికలో రాధాకృష్ణగారి 'ప్రేమించిచూడు, ప్రేమకథ పాత చింతకాయ పచ్చడిలావుంది.

సంకేపల్లి నాగరాజు, సందగిరి రాజేంద్ర శ్రీను వేములవాడ.

* * *

జయదేవ్‌గారి డిసెంబరు 21 కార్టూన్ ఎంతో బాగుంది పోతే సినిమా విశేషాలు మరీ శోభన్, వాణిశ్రీలకే పరిమితం చెయ్యడం అన్యాయం

రాధగారి "సరికొత్త ప్రేమకథ" మాంచి హుషారుగా సాగుతున్న సమయంలో "ఇంకా వుంది" అంటూ, మమ్మల్ని వూరిస్తూ ముగించడంన్యాయం కాదు

అన్ని విధాలా అందంగా తయారయి వచ్చిన ఈ వారం పత్రికకి చంద్రునికి మచ్చలాగా ఉంది అరుణా యిరానీ ముఖచిత్రం.

గుండాల వెంకటేశ్వరరావు (భువనేశ్వర్)

* * *

'30 ఏండ్ల యుద్ధం సమాప్తం', ఆంధ్రలో 'జె. ప్రకాష్ పర్యటన' వ్యాసాలు ఈవారం పత్రికకే హైలైట్ 'చీకటి వెలుగులు' కథ వాస్తవానికి దగ్గరలోనున్నది 'ఇంద్రావతి' కథ చాలా బాగుంది శీర్షికలన్నీ పత్రికకు మెరుగులు దిద్దాయి.

మందలపు రోశయ్య, బండ్లవారిపాలెం.

* * *

ప్రేమజంట శోభన్, శారదల ముఖ చిత్రంతో వెలువడిన పత్రిక నన్ను వూహాలోకాల్లో విహరింపజేసిందంటే నమ్మండి ఇక కథల్లో 'రేపటి ఆశ' సహజంగానో ఆకట్టుకుంటే పతితల్లో ఏ ఒక్కరూ కాదనలేననుకుంటాను. అవును సింహాచలం లాంటి





## జ్ఞాన పరీక్ష

ఒక బ్రాహ్మణునికి ఇద్దరు కుమారులుండేవారు. చదువుకునే వయస్సు వచ్చేసరికి అతడు విద్యాభ్యాసంకోసం వారిద్దరినీ ఒక గురుకులానికి పంపించాడు వారు అక్కడ చాలా ఏళ్లపాటు వుండి సర్వశాస్త్రాలనూ అభ్యసించి, విద్వాంసులై, గొప్ప జ్ఞానాన్ని సంపాదించారు తర్వాత వారు ఇంటికి వచ్చారు

ఇంటికివచ్చాక వారు సంపాదించిన జ్ఞానాన్నిగురించి తెలుసుకోవాలని తండ్రికి కోరిక కలిగింది ఆయనకూడా మహావిద్వాంసుడే! తన కుమారులు గురుకులవాసం చేసి విద్య నేర్చుకుంటే క్రమశిక్షణకు లోబడి ఉంటారనే అభిప్రాయంతోనే తాను స్వయంగా విద్య నేర్పడం లేదుగాని, అతనికి తెలియకకాదు

ఇంటికివచ్చాక ఆయన తన పెద్ద కుమారుణ్ణి ఒకనాడు పిలిచి "నాయనా! నీవు మిగిలినశాస్త్రాలతోపాటు బ్రహ్మవిద్యనుకూడా నేర్చుకున్నావు కదూ!' అని ప్రశ్నించాడు "నేర్చుకున్నాను" అని అతడు సమాధానమిచ్చాడు "అయితే, బ్రహ్మమంటే ఎటువంటిదో చెప్పు" అని తండ్రి అడిగాడు

దానికి ఆ చిన్నవాడు బ్రహ్మ స్వరూపాన్ని గురించి వేదాలనుంచీ, శాస్త్రాలనుంచీ ఎన్నో ప్రమాణాలను ఉదహరిస్తూ, ఏమేమో చెప్పసాగినాడు "సాకంతయు తెలియును" అనే ధోరణిలో అతడు ప్రసంగించెను అప్పుడు తండ్రి "సరే! నీవు బ్రహ్మన్ని నిజంగా తెలుసుకున్నావన్నమాట మంచిది నీవు వెళ్లవచ్చును" అని అతన్ని పంపివేసి రెండవ కుమారుణ్ణి పిలిపించి, అదే ప్రశ్న అడిగాడు "నేను వేదాంత శాస్త్రాన్నికూడా నేర్చుకున్నాను" అని పుత్రుడు చెప్పగానే తండ్రి 'బ్రహ్మ స్వరూపం ఏమిటి?' అని అడిగాడు ఆ బాలుడు జవాబు చెప్పక మౌనం వహించాడు అదిచూచి తండ్రి "ఏమి? బ్రహ్మ స్వరూపాన్ని చెప్పలేవా?" అని ప్రశ్నించాడు ఆ బాలుడు ఇలా అన్నాడు మౌనం మాని —

"బ్రహ్మ స్వరూపాన్ని వేదాలూ, శాస్త్రాలూ చెప్తున్నాయి కాని, అది సులభంగా అవగాహన కాని విషయం

'యతో వాచో నివర్తన్తే
అప్రాప్య మనసా సహ"

అని ఉపనిషత్తులో చెప్పినట్లుగా బ్రహ్మమునుగూర్చి నోటిమాటలతో చెప్పడం సాధ్యం కాదు మనస్సులో ఊహించడంకూడా అసాధ్యమైన పని అట్టి పరబ్రహ్మ స్వరూపాన్ని నేనెలా చెప్పగలను? అది మహావిద్వాంసులకే సాధ్యం కాదు అది గొప్ప సమాధినిష్ఠలో ఉన్నప్పుడే అనుభవైకవేద్యమే అవుతుంది అందువల్లనే నేనేమీ చెప్పలేక మౌనం వహించాను"

ఇలా అన్నందుకు తండ్రి ఎంతో తృప్తిపడ్డాడు నిజంగా బ్రహ్మస్వరూపం గ్రహించినవాడు తన రెండవ పుత్రుడే అని తెలుసుకున్నాడు

---

వాళ్ళు ఎందరో అర్ధాకలితో జీవితాలు వెళ్ళబుచ్చుతున్నారు వారిలాంటివారందరకి మంచిరోజు రావాలని మనమంతా ప్రార్థిద్దాం ధనవంతులందరు కాగితాలకన్న జీవితాలు విలువైనవని గుర్తించాలి

ఏ. వరహాలు (రామచంద్రపురం)

సా. న.

16—5—75 పత్రికలో మీరు ప్రచురించిన "సామాన్యుని సణుగుడు" చక్కని నిజాన్ని చాటుతున్నది. అందులకు మీరు అభివందనీయులు "సామాన్యుని సణుగుడు" అనే చిన్న శీర్షిక చూచి సినిమాహాలు యజమానులు సామాన్యులకు అన్ని విధాలా సహకరించెదరని కోరుతున్నాము "అంతరిక్షంలో ఆర్యభట్" గూర్చి విపులంగా తెలియజేశారు. ఇంకా ముందు దీని నడక ఇతర వివరాలు ఎప్పటికప్పుడు తెలియపరుస్తారని ఆశిస్తున్నాను.

ఇ జయప్రద సురేష్ కుమార్
శ్రీరాంనగర్

సీరియల్

"శమంత—హేమంత" నవల ప్రారంభము నుండి కథలో క్రొత్తదనమును చూపి మా హృదయాలను దోచివేసినది నాటి "బంగారు కలలు" నవల తరువాత ఇంత మంచి నవల రాలేదని చెప్పవచ్చును ప్రతివారము క్రొత్త క్రొత్త శీర్షికలతోను, వింతలతోను మిక్కిలి శోభను చేకూర్చుకొనుచున్న (మా),(మీ) పత్రికకు ఇవియే నా కృతజ్ఞతలు

బి శేషగిరిరావు (విజయనగరము—2)



"శ్యామలా, శ్యామలా ..." అన్న పిలుపు విని ఆ వచ్చింది తన మిత్రురాలు అరుణే అని గుర్తించి గదిలోంచి బయటకు వచ్చింది శ్యామల

హాలులో తండ్రి మెలకువతోనే ఉండటం చూసి గది మొత్త దగ్గరే ఆగిపోయింది

"ఎవరూ వచ్చింది? అరుణా! ఇదిగో మా శ్యామల రామ్మా లోపలకు" అంది అటుగా వచ్చిన కామేశ్వరి

"రా అరుణా!" అని శ్యామల కూడా పిలిచింది బయటకు ముఖం చూపి

అరుణ లోపలకు వచ్చింది ఆమెను తన గదిలోకి తీసుకువెళ్ళింది శ్యామల.

"నేను చెప్పలా అరుణ అని ఈ అమ్మాయే.' అంటూ కూతురి గదివైపే పరీక్షగా చూస్తున్న భర్తకు చెప్పింది కామేశ్వరి

"అహా" — తెలియని విషయం ఏదో తెలుసుకున్నట్లు తల ఊపాడు గోపాలరావు.

"అరుణ బుద్ధిమంతురాలైన పిల్లండీ. వాళ్ళు మంచి స్థితిపరులట అయితే ఏం? కాస్త భేషజం కూడా లేదా అమ్మాయికి ... ఇంటికి వచ్చినప్పుడు కాస్త కాఫీ అయినా ఇవ్వకపోతే మర్యాద కాదు కలిపింది లేదు. వెళ్ళి తయారు చేయాలి" అంటూ లోపలకు వెళ్ళింది కామేశ్వరి

గదిలో వాళ్ళిద్దరి మాటలు ఏమిటా అని అటువైపే ఉంచాడు తన చెవులను

"ఒంట్లో బాగుండక నేను కాలేజీకి రావటంలేదు అరుణా!" చెబుతోంది శ్యామల

"తలనొప్పా జ్వరమా?" అడుగుతోంది అరుణ

"రెండూను నామాట కాదనుకోంటే మా అమ్మనడుగు"

'ఈ మాత్రపు దానికి రుజువులు, సాక్ష్యాలు దేనికిగాని నీ మాటలు మేం నమ్మేశాం రేపయినా తమరి దర్శన భాగ్యం ఉంటుందా అని నేను కాదు మా అన్నయ్య కనవరిస్తున్నాడు"

"ఉష్! అరవకు మా నాన్నగారు"

"హాలులో పడుకున్నాయనేనా మీ నాన్నగారు?"

"అవును"

"ఆఫీసుకు వెళ్ళలేదే మీ నాన్నగారు?"

"జ్వరం ఉందుకని శెలవు పెట్టారు..."




*(గత సంచిక తరువాయి)*

తర్వాత వాళ్ళు చాలా మెల్లిగా మాట్లాడుకోవటం మొదలు పెట్టారు వాళ్ళు మాట్లాడుకొనేది తెలుసుకోవాలని గోపాలరావు పని కల్పించుకొని లేచి-గదిలో రేడియో టేబిల్ మీద ఉన్న కళ్ళజోడు పెట్టికోసం వెళ్ళాడు

అరుణ "నమస్కారమండీ" అంది లేచి. శ్యామల ఆమెను తండ్రికి ప్రత్యేకంగా పరిచయం చేసింది

గోపాలరావు కాసేపు అక్కడే నిలబడి కళ్ళద్దాలను భుజంమీది టవల్‌తో తుడుస్తూ అరుణ వంక ఒకటి రెండుసార్లు చూశాడు

పసిమి ఛాయలో—నిగనిగలాడే ముఖంతో ఆకర్షణీయంగా ఉంది, అరుణ తనకూతురు శ్యామల ఘ్రాతం? తమసంతతి మొత్తంలో అందమెవరిదయ్యా అంటే శ్యామలదే అంటా రందరూ కాకపోతే ఈ రెండు మూడు రోజులలో దిగులుకు వడిలిపోయి ఉంది అంతే

"కూర్చుని మాట్లాడుకోండి నేను వెళ్తున్నాలే" అని అక్కణ్ణుంచీ వచ్చేశాడు గోపాలరావు

కామేశ్వరి కాఫీ తీసుకువెళ్ళి ఇచ్చింది

మరో అరగంట కూర్చొని వెళ్ళిపోయింది అరుణ, ఆమె వెళ్ళిన తర్వాత కూతుర్నిపిలిచి "నువ్ కొన్ని రోజులవరకు బయట గడప త్రొక్కటానికి వీల్లేదు. కాలేజీకి వెళ్ళటం పూర్తిగా మానేయ్" అన్నాడు నిక్కచ్చిగా

శ్యామల గుడ్లనీరు గుడ్లకుక్కుకొంది

కానీ, భర్త మాటలు విన్న కామేశ్వరి మౌనంగా ఉండలేకపోయింది

"ఏమిటండీ అమ్మాయిని పూర్తిగా కాలేజీకి వెళ్ళొద్దంటున్నారు?"

"అమ్మాయి విషయంలో— నీ మాట ప్రకారమే నడుచుకుందామనుకొంటున్నాను కాముడూ శ్యామూని కాలేజీకి పంపటం నాకిక ఇష్టంలేదు అది బజారు గడప దాటితే నేనిక సహించలేను"

శ్యామల అంతకుముందెప్పుడో తనస్థానానికి వెళ్ళింది కామేశ్వరి తిరిగ్గా భర్తమంచం మీద కాళ్ళకట్ట దిక్కున కూర్చొంది.

"పోనీ శ్రద్ధగా చదువుకొంటోందికద? వెళ్ళనివ్వండి కాలేజీకి దాన్ని మనమిప్పుడు ఏమీ దాని పెళ్ళి ప్రయత్నాలు చేయటం లేదు కదా? ఇంట్లో గోళ్ళుగిల్లుకొంటూ కూర్చున్నందువల్ల మాత్రం ప్రయోజనమేముంది? ఎలాగో ఒకయాడాదికల్లా దాని ఆ కాలేజీ చదువులు పూర్తయిపోతాయ్ అప్పుడు వెసులుబాటు చూసుకొని ఏదో మనకు తగిన సంబంధం చూసుకుందాం"

"వీల్లేదు నా మాటకు ఎదురు చెప్పకు కాముడూ అమ్మాయిని గురించి బాగా ఆలోచించే నేనీ నిర్ణయానికి వచ్చాను మధును ముందు కాదని తర్వాత కాలేజీకి వెళ్ళమన్నానంటే వాడు మొగపిల్లడు. చదువుకున్నా, అడ్డగాడిదలా బజార్లు తిరిగినా— ఆ ఫలితం ముందు ముందు అనుభవించేది వాడొక్కడే ఆడపిల్ల అలా కాదు చేసుకున్నదానికి ఫలాన్ని తను అనుభవించటమే కాక తన కుటుంబం మొత్తాన్ని రచ్చకీడ్చి పిప్పి పిప్పిచేస్తుంది

జరిగిన కద

గోపాలరావు పిల్లలు పెడత్రోవ పడ్డారు భార్య కామేశ్వరి వద్దంటున్నా పేకాటకెళ్తుంటాడు రాముడు మెట్రిక్ తప్పి తిరుగుతూ, కృష్ణ నిరుద్యోగిగా, కాలేజీలో శ్యామల ప్రేమకలాపం, మధు కాలేజీకి సరిగా వెళ్ళకా విసిగించగా తన బాధ్యత గుర్తిస్తాడు గోపాలరావు తండ్రితో ఘర్షణపడి యింట్లోంచి వెళ్ళిపోతాడు రాముడు శ్యామల ప్రేమించింది స్నేహితురాలు అరుణ అన్న ప్రకాష్ అనీ, వారు స్థితిపరులనీ ఆమె ద్వారానే తెలుసుకుంటాడు గోపాలరావు

శ్యాము ప్రవర్తనను గురించి నువ్వు ఎన్నో సార్లు చెప్పావు కానీ, నేను వినలేదు అది రాత్రి ప్రొద్దుపోయాక రావటం ఆ వేళ నా కళ్ళారా చూశాను ఇల్లాంటిమాట పెడచెవిన పెడితే ఆ యిల్లు ఏగతికి దిగజారుతుందో తెలిసి వచ్చింది అందుకే ముందు జాగ్రత్త పడుతున్నాను ''

భర్త మాటలకు ఇక ఎదురు చెప్పలేదు కామేశ్వరి కూతురు కాలేజీ మానేస్తే దాని తిరుగుళ్ళు పూర్తిగా తగ్గిపోతయ్ తమపరువూ నిలడుతుంది లోలోపల సంతోషంగానే ఉంది ఆమెకు

తర్వాత మాటల్లో కూతురిపెళ్ళికి సంబంధించిన ప్రసక్తి తెచ్చింది కామేశ్వరి.

''ఒకవేళ మనమే అమ్మాయిపెళ్ళి చేయదలిస్తే—ఏమిటండీ దారి ?''

గోపాలరావు అంతరంగంలోనూ అదే ఆలోచన

ఇంతకాలం తన సంపాదన ఇల్లుగడవటానికీ, పిల్లల చదువులకూ, తన ఖర్చులకూ సరిపోయింది తప్పితే పైసాఅంటూ వెనక వేయలేదు అమ్మాయి చదువుకొంటోంది కదా ? దాని పెళ్ళికి ఇప్పుడేం తొందర ?' అన్నదే ఎప్పటి దప్పటి తన ఆలోచన పోనీలే గతాన్ని గురించి ఎంత ఆలోచించీ ప్రయోజనం లేదు అంతకూ అవసరం వస్తే జి పి ఎఫ్ లోను, ఎల్ ఐ సి లోను తీసుకొంటే సరి— అవి రెండూ కలుపుకున్నా మూడు నాలుగు వేలకుమించి రావే వాటిల్లో కట్నకానుకలు, పెళ్ళిఖర్చుల మాటేమిటి ? అతి తక్కువగా అంచనా వేసినా గ్రాడ్యుయేట్ అయినవాడు అయిదారువేలు పెడితేగాని రాడు మరి ?

''దానికి కళ్యాణ ఘడియరానీ కాముడూ పరిస్థితులన్నీ అప్పటికవే చక్కబడతయ్'' అన్నాడు పైకి—కేవలం భార్యను సంతృప్తి పరచటం కోసమే

* * *

రాత్రి తొమ్మిదిగంటల ప్రాంతంలో వచ్చాడు కృష్ణ

''నా మిత్రుడి బలవంతం వల్ల ఒక మ్యారేజీ ఫంక్షన్‌కు వెళ్ళవలసి వచ్చింది



నాన్నగారూ." అంటూ తను క్రితంరోజు సాయంత్రమనగా వెళ్ళి అప్పటివరకు ఇంటికి రాకపోవటం గురించి తండ్రికి సంజాయిషీ చెప్పుకున్నాడు అతడు.

కానీ, కొడుకు మాటలను ఎందుకనో నమ్మలేకపోయాడు గోపాలరావు ఎటూ కాని

## ఈ సంఘంలో కుటుంబమే ఇది!

ఈరోజుల్లో పెళ్ళా? . అందులో మూఢమి కూడా పోనీ, వైదిక మతంమీద నమ్మకం లేని ఎవళ్ళో—ఏగ్గోళ్ళనో పెళ్ళిచేసుకున్నారు దానికి వెళ్ళాడులే అనుకుందా మనుకున్నా కృష్ణ ముఖం విందుభోజనం చేసినట్లు కళగాలేదు ఏకాదశి ఉపవాసం చేసినవాడి ముఖమల్లే పీక్కుపోయిఉంది

అయినా వెంటనే తన అభిప్రాయాన్ని వెల్లడించకుండా, "సరే సరే ముందు వెళ్ళి భోజనం చెయ్యి" అన్నాడు

"రారా అబ్బాయ్ వడ్డిస్తాను" అంటూ కామేశ్వరి లేచింది ఆమెవెనకే వెళ్ళాడు కృష్ణ

భోజనం చేసే సమయంలో తండ్రి జ్వరం గురించి చెప్పింది కామేశ్వరి కొడుక్కు

"ఉదయం నుంచీ జ్వరమట కద నాన్న గారూ !"— భోంచేసివచ్చి చేరవగా తండ్రి మంచంమీద కూర్చొని అడిగాడు కృష్ణ

"నా ఒంటికి జ్వరం వచ్చింది ఈవేళే కానీ, నా బ్రతుక్కు అది ఏనాడో వచ్చిందని జరుగుతున్న అనుభవాలు విప్పి చెబుతున్నాయి కృష్ణా" అన్నాడు గోపాలరావు

కృష్ణకు ఏం మాట్లాడవలసిందీ తోచ లేదు

"చేతికి అందివచ్చిన ఒకబిడ్డ రాముడు. . వాడు మనకు కాకుండా పోయాడు ఇక రెండోవాడవు – అన్నీ తెలిసి ఉండీ నీ తెలివి తేటలను నిరుపయోగం చేస్తున్నావ్ , నీ వల్ల కూడా నాకు మనశ్శాంతి లేకుండా పోతోంది కృష్ణా . నువ్ నిన్న సాయంత్రమనగా వెళ్ళి ఇప్పుడు వచ్చావ్ ! అమ్మమీద, నామీద ప్రమాణంచేసి చెప్పు – నిజంగానే నువ్ ఆమ్యారేజి ఫంక్షన్‌కు వెళ్ళావని . ?"

" "

"చెప్పలేవు అలా నీవు ఏ ఫంక్షనుకు వెళ్ళలేదని నేను ముందే గమనించాను. అందుకు సాక్ష్యం పీక్కుపోయిన నీముఖమే . ఏవో కాని పోని ఆలోచనలు పెట్టుకొని నీమనసును పాడు చేసుకుంటావ్. అందువల్ల నీకు ఒరిగేదేమీ లేకపోగా కన్న తల్లిదండ్రుల్ని ఉసురుపెట్టిన వాడి వవుతావ్. నా మాట విను కృష్ణా. ఇది ఆజ్ఞాపనకాదు అభ్యర్థన. రాముడిలా నువ్వు మాకు దూరం కాకు ! నిన్ను గురించి ఎన్ని తిప్పలు పడైనా సరే ఏదో ఉద్యోగం కుదిరే ఏర్పాటు చేస్తాను త్వరలో "

"మీరుకాదు నాన్నగారూ – నేనే ఏర్పాటు చేసుకుంటాను, త్వరలో ఏదో ఒకటి

నా అభిప్రాయా లేమిటో మీకు ...

# ప్రపంచము యొక్క ప్రప్రథమ డెటర్జెంట్ ఉతికే బార్

# సూపర్ 777



**హెచ్చు తెల్లదనము, తక్కువ ఖర్చులో**




సూపర్ 777 ఉతుకు ప్రపంచములో సరిక్రొత్తది!
ఇది క్రొత్త ఫార్ములా దీనికి ఎక్కువ బట్టలను ఎక్కువ
తెల్లగా, ఎక్కువ శుభ్రముగా ఉతికే సామర్థ్యము
ఉన్నది—ఉప్పు నీళ్లలో కూడ! దీని ధర మామూలు
బార్ సబ్బుల కంటె తక్కువ కూడ!

**ఈ క్రొత్త రకపు ఉతికే బార్‌ను వాడడము ప్రారంభించండి—సూపర్ 777 డెటర్జెంట్ ఉతికే బార్!**

shilpi hpma 6A/73 TEL

చెప్పాను అంతేకాని నా వ్యక్తిత్వాన్ని చంపి వేసే ప్రయత్నం చేయకండి '' అని - బర బర గోడకు నిలబెట్టిఉన్న మడత మంచాన్ని వసారాలోకి తీసుకువెళ్లి అక్కడే పడుకున్నాడు కృష్ణ

'లేక ఏడ్చే అభాగ్యులు కొందరు, ఉండి అనుభవించలేని మూర్ఖులు కొందరు — దేశకాల పరిస్థితుల్ని ఆలోచించకుండా మాట్లాడుతున్నారు వాడు కాటిలో శవాన్ని తగలబెట్టటానిక్కూడా ఒకరి రికమండేషన్ అవసరమన్న యదార్థం వాడికి తెలియదు భగవాన్, నా బిడ్డలందర్నీ ఇలా సృష్టించావేం ?' అంటూ స్వగతంగా విలపించాడు ఆ నలుగురుబిడ్డల తండ్రి

* * *

మర్నాడు ఉదయానికి గోపాలరావు జ్వరం మరికొంత ఎక్కువైంది

''నామాట విని ఈవేళ్టైనా ఆసుపత్రికి వెళ్ళిరండి మామూలు మందుబిళ్ళలకు ఇది తగ్గేట్లు లేదు డాక్టరైతే పరీక్షచేసి ఖచ్చితమైన మందులిస్తాడు'' అంది కామేశ్వరి

''నీది వట్టి ఖంగారే కాముడూ ఇదేమంత జ్వరం మళ్ళీ మాత్రలు తెప్పించి వేసుకుంటాను'' అన్నాడు గోపాలరావు కానీ, కృష్ణకూడా తల్లిపక్షానే మాట్లాడి ఆసుపత్రికి బయలుదేరితేగాని వీల్లేదని — తండ్రిని ఒప్పించాడు ఎలాగోలా

గోపాలరావు వెంట రిక్షాలో తనూ బయలు దేరాడు కృష్ణ

వాళ్ళ రిక్షా కొద్ది దూరం పోయాక మళ్ళీ రమణమూర్తి కలిశాడు

ఆయన అడిగినమీదట తనకు జ్వరం వస్తున్నట్లు చెప్పాడు గోపాలరావు.

## ఈ సంఘంలో కుటుంబమే ఇది !

''అయ్యో పాపం! అల్లాగటండీ! నిన్న మీ యింటికే వద్దామని బయలుదేరాను అంతలోనే మా అమ్మాయి వాళ్ళు దిగారు ఊరునుంచీ నిన్న కాకపోతే కాకపోయింది కనీసం ఈవేళైనా వద్దామనుకున్నాను అయితే ప్రొద్దుటే తమరి దర్శన భాగ్యమైంది. ఇపుడు ఆసుపత్రికి వెళ్తున్నారా?''- యుక్తిగా అడిగాడు రమణమూర్తి

''అవును నాకు మాత్రం డాక్టర్ల చుట్టూ తిరగాలని లేకపోయినా మా ఆవిడ, కృష్ణ బలవంతంచేసి ఇలా తిప్పిస్తున్నారు'' అని నవ్వుతూ చెప్పాడు గోపాలరావు

'' ఏదేమయినా మీ ఆవిడ కామేశ్వరమ్మగారు ఎంతో ఉత్తమురాలు సుమండీ ఇక మీ కృష్ణమోహన్ సంగతి నాకు తెలియందేముంది? మెరికలాంటి కుర్రాడు '' అన్నాడు ఆయన కృష్ణవైపు చూస్తూ

''సరేగాని మూర్తిగారూ, మీకు తీరిక ఉంటే సాయంత్రం ఓ మాటు అలా రండి మాయింటివైపు '' అన్నాడు గోపాలరావు ఏదో మాటవరసకు

''తప్పకుండాను మీరు మాత్రం శ్రద్ధగా మందులు అవీ వాడండి, సుమా! ఆకలి వేసినప్పుడు, ఒళ్ళు అలిసినప్పుడు అశ్రద్ధ చేయకూడదని ఇప్పటికీ మా హెడ్ మాస్టర్ అంటూనే ఉంటాడు, , యదార్థం కూడా అంతే .ఏవోయ్ కృష్ణమోహన్. మీ నాన్నగార్ని జాగ్రత్తగా కనిపెట్టి ఉండు. ''

''అలాగే మాస్టారూ''—మాజీగురువుగారు కాబట్టి కాస్త విలువ ఉంచి ఆ మాత్రం అన్నాడు కృష్ణ

గోపాలరావు రిక్షాముందుకు, రమణమూర్తి తన యింటి ముఖంపట్టారు—

తను యిచ్చినమాటప్రకారమే ఆ సాయంతం గోపాలరావు యింటికి వచ్చాడు రమణమూర్తి

ఆయనతో ఆత్మీయంగా తన కుటుంబ సమస్యలు చెప్పుకున్నాడు గోపాలరావు

శ్యామలను చదువు మాన్పించి వేసిన విషయం తెలిసి,

''శుభస్య శీఘ్రం . ఎలాగైనా మనలాంటి కొద్ది కొద్ది వాళ్ళకు తగవులెండి ఈ కాలేజీ చదువులు అమ్మాయిని ఎలాగో చదువు మాన్పించివేశారు అలాగే ఆ మూడుముళ్ళూ కూడా వేయించరాదూ? మీరు కనుక 'ఉ' అంటే లక్షణం లాంటి ఓ సంబంధం చెబుతాను ''అన్నాడు రమణమూర్తి

అను ఇందుకు ఒప్పుకొంటే కూతురు మనసు ఏ విధంగా బాధపడుతుందో, అదేమై పోతుందో-ఆప్రకాష్ సంగతి ఏమిటో -అర్థం కాని అయోమయస్థితిలో పడాడుగోపాలరావు

''ప్రస్తుతం నా ఆర్థిక పరిస్థితి బాగుండ లేదు అమ్మాయి పెళ్లికి కొంతటైమ్ తీసుకొంటుంది ''అన్నాడు చివరకు

''సరే అలాగే కానీయండి అయితే ఎప్పుడైనా నా మాట మరచిపోకండి కేవలం నేను మీకు చేయగలిగేది మాట సాయమే కద ?''— అంటూ శలవుపుచ్చుకున్నాడు రమణమూర్తి.

* * *

మధు కాలేజీ నుంచి ఆలస్యంగా వచ్చాడు ఆ రోజు. .అప్పటికి వారం రోజులు కాచిన గోపాలరావు జ్వరం తగ్గి రెండు రోజులైంది. వాడు వచ్చేటప్పటికి లైట్లు వెలిగినయ్

''ఏరా మళ్ళీ మొదలయ్యాయా నీ తిరుళ్ళు ?''-అడిగాడు కొడుకును

''లేదు నాన్నగారూ ..సెంటర్లో పెద్దన్నయ్య కనిపించాడు .''

మధు మాటలు పూర్తి కాకుండానే అన్నాడు గోపాలరావు—

''రాముడు ఈ ఊళ్ళోనే ఉన్నాడా ?! నీకు కనిపించాడా! ఏమన్నాడు? ఇంటికి రానన్నాడా?''

''నాతో అవన్నీ ఏమీ అనలేదు . కానీ . నాన్నగారూ! అన్నయ్య సెకండ్‌హాండ్ బుక్ స్టాల్ పెట్టాడు సెంటర్లో ఈ వేళే

(40 వ పేజీ చూడండి)



"అవునయ్యా మహానుభావా! నేనూ మొదట్లో నీలాగే అనుకున్నాను."

"ఏం-ఇప్పుడు ఆ అభిప్రాయం ఎందుకు మార్చుకున్నారూ ?"

అతను నవ్వాడు ఆ కళ్లు జ్ఞాపకాలతో మెరుస్తున్నాయి, మొహం మీద అనుభవాల ముడతలు

"ఎందుకు మార్చుకున్నానో ఆ కథ చెప్పనా?"

అతనికి దగ్గరగాజరిగాను కుతూహలంతో

బయటుఫానకురుస్తోంది చీకటిరాత్రి అతనూ నేనూ సహ ప్రయాణీకులం ఏదో రకంగా కాలక్షేపం కావాలి నేను ప్రయాణం చేస్తున్న ఈ దయ్యాల బండిలో రైల్లో కూచుని చూస్తుంటే ఆకాశంమీద పరుగెత్తే వెలితెలి నక్షత్రాలు ఈదురుగాలి నరాలను జివ్వుమని పిస్తున్న చలి తాడేపల్లిగూడెం చేరే సరికే అర్ధరాత్రయింది ఇహ ఇది విశాఖపట్నం




విప్పుడు చేరుకునేట్లూ? అయినా మాఆవిడకు మతిలేదు ఈ రైల్లోనే రమ్మనమని నా కెందుకు రాయాలి? అయినా మనమరాలి బారసాలకని వెళ్లినమనిషి అన్న ప్రాశనం నాటి కైనా రాకపోతే, రిటైరయి మూడేళ్ళు దాటు తున్నవాణ్ణి, నేనేం చేసేట్లూ? అదేమంటే, మీరే ఇక్కడకు రాకూడదూ ఒకసారి ? కాస్త గాలి మార్పుగానూ ఉంటుంది, అమ్మాణ్ణిని చూసినట్లుగానూ వుంటుంది ! అనీ ఉత్తరం మీద ఉత్తరం!! అందుకనే బయలుదేరాను వెధవది, ఈ ప్యాసింజరు రైలు బండీలో— కష్టంగా వున్నా కాస్త ఖాళీగా వుంటుంది కదా అని, పైగా కట్టుకున్నదానిమాటఖాతరు చేసినట్లూ వుంటుంది కదా అని కానీ ఈ రైలుబండి మాత్రం వేగంలో మా వూరి రెండెడ్లబండికన్నా కనాకష్టంగా వుంది దీనికి తోడు ఈ ముసురు ఒకటి సాయంకాలం నుండి !! చలి చలి అడపా దడపా ఒకటే రెండు వానబొట్లు .అంతలో ఆకాశం ఎవరో మంత్రించినట్లు నిర్మలం కావడం మళ్లీ నల్లని మబ్బులుచంద్రుడులేనిఆకాశం కాంతి లేని నక్షత్రాలు తలలు వూగిస్తూ వెనక బడుతున్న చెట్లు దూరంగా గాజు కళ్ళల్లో ఇంకిపోతున్న కాంతుల్లాంటి దీపాలు . మనసు లోపల ఏదో దిగులుగా వుంది ముసలి తనపు దిగులు

"నాకప్పుడు ఇరవయ్యేళ్లు. ఇంకా పెళ్లి ాలేదు"

అతని గొంతు గభీరంగా ధ్వనిస్తోంది తకాలాన్ని చీల్చుకుని వస్తున్న శబ్దం నేను కసారి సర్దుకుని కూచుని వినడం ప్రారం భించాను అతను కథను ఆవిధంగా ప్రారం భించడం నాకు ఆసక్తి దాయకంగా వుంది. ిజానికి ఇరవయ్యేళ్ళ వయసులో నాకూ పెళ్ళి కాలేదు కనిపించిన ప్రతి అందమైన ఆడ ిల్లనూ నా పక్కన భార్యగా వూహించుకుని ంగుళమేడను కట్టుకునేవాణ్ణి !

ఆ రైలుపెట్టెలో వున్న ఒకరిద్దరూ ిద్రలో జోగుతున్నారు అతను నావేపే ిశ్చలంగా చూస్తూ, మెరిసే కళ్ళతో, ఉద్విగ్న కంఠంతో కథ చెబుతున్నాడు.

* * *

నాకప్పుడు ఇరవైయ్యేళ్లు. ఇంకా పెళ్లి కాలేదు పెళ్లిమీద అంతగా నాకు ఆసక్తి కూడా లేదు చిన్నప్పుడే నాకు తల్లీ—దండ్రీ కూడా పోవడంతో మా మేనమామ నన్ను తీసుకు

మీ ముఖము చూచి
మెచ్చుకొనేవారెందరో... మీ చర్మమునకు
చెరుపుచేసేవారూ ఉన్నారు
పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్
సహాయమును పొందండి

పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ మీ చర్మమును గాలి, దుమ్ము, వాతావరణములనుండి కాపాడుతుంది. దానిలోగల ఒక ప్రత్యేకపు హ్యూమెక్టంట్ చర్మమును తడి ఆరకుండా ఉంచుతుంది. దానివల్ల మీ ముఖము నున్నగా, జిడ్డులేకుండా ఉంటుంది. పౌడరు రాసుకొనేముందు దాన్నివాడితే దివ్యంగా ఉంటుంది. మీ మేకప్ తాజాగా, అందంగా గంటలతరబడి నిలుస్తుంది. లేదా, దాన్ని పూర్తి మేకప్‌గా వాడినా మంచిదే. జ్ఞాపకముంచుకోండి —మిమ్మల్ని మెచ్చుకొనే వారున్నట్లే, మీ చర్మమును మెచ్చుకొనేవారూ ఉండాలి.

# పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ — పౌడరు రాసుకొనేముందు వాడుటకు దివ్యమైనది




చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపితము)

వెళ్లి పెంచాడు దేవుడులాంటివాడు మా మేనత్త ఎటువంటిదనుకున్నావు? నిజంగా ఓ గార్డెన్-వో దేవత నన్ను అడుగు క్రింద పెట్టనిచ్చేదికాదు అందమైన గుడ్డలు. మంచి భోజనం, కావలసిన చదువు ఓ మహారాజ కుమారుడులా పెరిగాను స్వామీ నేను చిన్నప్పుడు!

ప్రతి పుట్టినరోజుకూ ఆమె నాచేత గుళ్లో అభిషేకం చేయించేది బీదలకు ఒకళ్లిద్దరకు గుడ్డలిప్పించేది, అన్నం పెట్టించేది మూడు పూవులూ, ఆరుకాయలుగా సాగిపోయిన బాల్యజీవితం నాది!

మేమున్న పల్లెటూళ్లో ఎలిమెంటరీ స్కూలు చదువైపోతే, నన్ను బస్తీకి పంపించి హైస్కూల్లో చేర్పించింది హైస్కూలు చదువుకూడా అయిపోతే, గుంటూరు పంపించి కాలేజీలో చేర్పించింది కాలేజీ చదువు కూడా అయిపోతే మద్రాసు పంపించి యూనివర్సిటీలో చేర్పించింది అప్పుడు నేను యం ఏ మొదటి సంవత్సరం చదువుతున్నాను

ఇంటికి నేను ఉత్తరం రాయడం ఆలస్యమైనా, ఇంటి దగ్గరనుండి మాత్రం తప్పని సరిగా వారానికో ఉత్తరం వచ్చేది ఉత్తరంలో సంగతులేమున్నా లేకపోయినా, మా అత్తయ్య రాయమన్న ఒకటి రెండు వాక్యాలు మాత్రం తప్పనిసరిగా వుండేవి

"బాబూ! తప్పకుండా ప్రతివారం తలంటిపోసుకో!"

"నాన్నా! అవీ ఇవీ, ఇష్టమున్నా లేకపోయినా ఇతరుల బలవంతంమీద తిని, ఆరోగ్యం పాడుచేసుకోకు సుమా!" ఇట్లా వుండేది ఆ ఉపదేశ గీత

ఒకరోజున ఊరిస్తున్నట్టుగానే ఆ ఉత్తరం వచ్చింది

"శంకరం! వచ్చే మంగళవారం నీపుట్టిన రోజు తప్పకుండారా అత్తయ్యా నేనూ నీకోసం ఎదురు చూస్తుంటాం!"

మొదట్లో వెళ్ళకపోతేనే బావుంటుందనుకున్నాను ఎన్నో పుట్టినరోజులు ఆ పల్లెటూళ్లో చేసుకున్నాను ఒక్క పుట్టినరోజు అదీ మహానగరంలో, స్నేహితులమధ్య ఉహూ కన్ను మూసుకున్నా అత్తయ్య నాదగ్గరకు వచ్చి "రావా బాబూ" అంటూ ప్రేమగా ఆర్తిగా, జాలిగా అన్వేషిస్తున్నట్లనిపించేది బయలుదేరక తప్పిందికాదు

# కనకతార

ఆ రోజు ఎట్లాగే వానపడుతోంది మనసంతా చీకాకుగా వుంది పుట్టిన రోజు హడావిడీ పొద్దునే అయిపోయింది

"బాబూ! సాయంకాలం ఊళ్ళో వున్న ఒకళ్లిద్దర్నీ టీ పార్టీకి పిలిచావా అయ్యా?"

"ఎందుకత్తయ్యా ఇవన్నీ?" నా గొంతులో డల్‌నెస్

"సంతోషం నాది!" ఆ అత్తయ్యకు నేనేమని సమాధానం చెప్పను? పార్టీకి ఎవరెవరో వచ్చారు ఆహ్వానితుల సంఖ్య పెద్దగా లేకపోయినా, వాళ్ల రణగొణధ్వనులు, స్టేల్ జోక్స్, మామూలు లౌకిక వ్యాపార సంబంధమైన మాటలు, ఒకళ్ళ ఇష్టం కోసం మరొకళ్లు తమ మనసులోని మాటను కప్పిపెట్టుకుని ఆత్మీయతా సంబంధమైన వాక్య సంపుటిని పెదిమల మీద అంటించుకోడం,

> **లోగుట్టు**
>
> ఈ మధ్య పశ్చిమ జర్మనీలో పోలీసులు హరేకృష్ణ భక్తుల్ని సోదా చేయగా వారివద్ద ఆయుధాలు, విదేశీ కరెన్సీ బోల్డంత దొరికిందట ఫ్రాంక్ ఫర్టు సమీపంలోని వీళ్ల ఆశ్రమంపై పోలీసులు దాడిచేయగా 51,000 మార్కులు, కొన్నిబస్తాల నాణాలు, అనేక ఆయుధాలు పట్టుబడ్డాయి

నాకంతా అసహ్యంగా వుంది అందమైన మద్రాసు వదిలి, పల్లెటూరుకు వచ్చినందుకు అవకాశాన్ని వ్యర్థం చేసుకున్నందుకు బాధ!

ఆ ఊళ్ళో వున్న నంబి ఆచార్లు, కరణం మున్సబులు, రెండొందలెకరాల భూస్వామి చౌదరిగారు, కాంగ్రెసు ఉద్యమంలో జైలుకు వెళ్ళొచ్చిన రాఘవయ్య పంతులు, ఈ బాపతు మనుషులు ఆ ఆహ్వానితులు అక్కడ వున్న అందరి సగటు వయసూ యాభైకి పైనే వుంటుంది యాభై పళ్ళ వాళ్ళమధ్య ఇరవై య్యేళ్ళ కుర్రవాడు! నా మన స్థితిని ఊహించుకో బ్రదర్!

ఇంతలోకి ఒక్కడ వాతావరణంలోకి, ఒక్కసారి పుష్పసుగంధం వచ్చింది కారుమబ్బుల మధ్య మెరపు మెరిసింది ఎడారిలో తొలకరి జల్లు కురిసింది

కనకతార లోపలికి ప్రవేశించింది

కనకతారకు వెనగ్గా ఆమె భర్త చారుదత్తుడు లోపలకు వచ్చాడు కనకతార, ఆ రోజుల్లో బి ఏ, ఏ రోజుల్లో?—నలభై ఏళ్ళ క్రితం!! మరి చారుదత్తుడు? లండన్ నుండి దిగి వచ్చిన దొరబాబు ఆక్స్‌ఫర్డు యూనివర్సిటీలో చదివి, అక్కడ క్రికెట్ టీముకు కెప్టెన్‌గా ఎన్నుకోబడ్డ స్పోర్ట్స్‌మన్!

చారుదత్తుడు యౌవనంలో ప్రిన్స్‌గా వున్నాడు, విశాలమైన మొహం ఆమొహంలో నిర్మలత్వం నల్లని కళ్ళు ఆ కళ్ళలో చిలిపితనం నొక్కు నొక్కులజుట్టు ఆ జుట్టులో అందర్నీ కాదనగల గర్వం అతను నన్ను ఆకర్షించాడు

నిజానికి, అతనికన్నా కనకతార నన్నెక్కువగా ఆకర్షించింది ఆమె శలాకలా వుంది అందంగా వుంది పాలరాతి శిల్పంలా వుంది కాళిదాసు శకుంతలలాగా వుంది ఆమె హెలెన్, క్లియోపాత్రాల వారసురాలేమో అనుకున్నాను నేను అంత అందంగా వుంది నవ్వితే అందం కంఠంలో ఓ సన్నని జీర చూపులో అందం ఆ చూపులో కైపెక్కించే మత్తు పైట సర్దుకుంటే యౌవనం తన జయపతాకను విసురుతుంది ఆమె నడిస్తే, సౌందర్యం తన పరిధిని విస్తరిస్తుంది

ఆమె నా దగ్గరకు వచ్చింది గ్రీటింగ్స్ చెప్పింది అతను నా దగ్గరకు వచ్చాడు ప్రెజెంట్ అందించాడు వాళ్లిద్దరూ ఫారిన్ రిటర్న్డ్! యంగ్ బ్యూటిఫుల్ కపుల్! నేనో? ఆఫ్టర్ ఆల్ వో యూనివర్సిటీ స్టూడెంటును అనుభవంలేని బాచిలర్‌ను!!

నాకళ్లు కనకతార మీద నుండి కదలనంటున్నాయి నాకళ్లు ఆమె దగ్గరకే కదులుతున్నాయి కానీ వాళ్లు నన్ను గమనించడం లేదు వాళ్లల్లోవాళ్లు జోక్స్‌వేసుకుంటున్నారు

"యూ నాటి గర్ల్!" అన్నాడు చారుదత్తుడు

ఆమె కిలకిలా నవ్వింది మళ్లీ మరోసారి నవ్వకూడదూ?

కాఫీ టిఫిన్లు ముగించిన తర్వాత, "మరి వెళ్లొస్తాం?" అన్నారువాళ్లిద్దరూఒక్కసారే!

"ఇప్పుడెక్కడికీ ఈ వర్షంలో?" అన్నది అత్తయ్య కంగారుగా

"అవతల టౌన్‌లో మరో ఎంగేజ్‌మెంట్ వుంది మీ ఇన్విటేషను కాదనలేక ఇక్కడకు వచ్చాం!" అన్నాడు చారుదత్తుడు

నేను మెల్లగా కనకతారకు దగ్గరగా వెళ్లి

(32వ పేజీ చూడండి)








# వారఫలం

మహేష్

## 6-6-1975 శుక్రవారం మొదలు 12-6-1975 గురువారం వరకు

**మేషం** :— వృత్తి వ్యాపారాలు బాగుంటాయి మీ ప్రయత్నాలు ఫలిస్తాయి విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది రావలసిన డబ్బు అందుతుంది రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి మిత్రులకు సహాయం చేస్తారు స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి సాటివారిలో గౌరవం లభిస్తుంది

**వృషభం** — ఉద్యోగంలో శ్రమ కలుగుతుంది మీ తాలూకు వస్తువులు పోవచ్చును వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి వృత్తిలో ఆదాయం పెరుగుతుంది ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు

**మిధునం** — మీ ప్రయత్నాలు ఫలిస్తాయి ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి వారం మధ్యలో అధిక వ్యయం జరుగుతుంది వ్యాపారంలో చికాకులు ఏర్పడతాయి వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను అనుకూలత లభిస్తుంది స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది విలాస వస్తువులు కొంటారు

**కర్కాటకం** — ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి సజ్జన సాంగత్యం లభిస్తుంది వృత్తిలో ఆదాయం పెరుగుతుంది సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది బంధువులకు చికాకులు ఏర్పడతాయి

**సింహం** :— వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు మిత్రులకు సహాయం చేస్తారు ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకుంటారు విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది స్త్రీలకు—దైవకార్యాలు నెరవేరతాయి వినోద కాలక్షేపాల్లో పాల్గొంటార

**కన్య** — మీ కార్యక్రమాల్లో శ్రమ కలుగుతుంది సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది వారం మధ్యలో రావలసిన డబ్బు అందుతుంది వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. సంతోషకరమయిన వార్తలను వింటారు.

**తుల** — ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. వారంఆఖరులో వృత్తి వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన వ్యయం జరుగుతుంది

**వృశ్చికం** — వృత్తిలో సాటివారి పోటీ పెరుగుతుంది ప్రయాణాలు వాయిదా పడతాయి మీ ఆలోచనలు ఫలిస్తాయి ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు వారం ఆఖరులో కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నిస్తారు స్త్రీలకు—ఆరోగ్యంబాగుంటుంది పుణ్యకార్యాలు చేస్తారు

**ధనుస్సు** — మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి మిత్రుల సహాయం లభిస్తుంది రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది సాటివారితో మాట పట్టింపులు తగవు వారం ఆఖరులో ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది

**మకరం** —మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి వారం ఆఖరులో మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధిస్తారు

**కుంభం** — వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి రాజకీయవ్యవహారాలు బాగుంటాయి ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు సాటివారిలో గౌరవం లభిస్తుంది మునుముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధిస్తారు స్త్రీలకు—సంతోషకరమైన వార్తలను వింటారు దైవకార్యాలు నెరవేర తాయి

**మీనం** — రావలసిన డబ్బు అందుతుంది సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది వృత్తిలో సాటివారి పోటీ తగ్గుతుంది అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది స్త్రీలకు ఆరోగ్యంబాగుంటుంది వినోద కాలక్షేపాలలో పాల్గొంటారు ●



నేను జైలుకొచ్చినప్పుడు అసలు రైలు బండి కనిపెట్టలేదు —
ఓస్—అంతేనా ? నేను జైలుకొచ్చినప్పుడు గుర్రబ్బండి అంటే జనానికి తెలీదు
గుర్రమా ? గుర్రమంటే ఏవిటిగురూ ?

సీరియల్

# శమంత - హేమంత

## పి.వి.ఆర్. శివకుమార్

*(గత సంచిక తరువాయి)*

ఆరు నెలలు పూర్తయినా, ఆదిత్య ట్రయినింగ్ అనుకున్న షెడ్యూల్స్‌లో పూర్తికాలేదు మరో మూడు నెలలకు పొడిగించారు అధికారులు

వచ్చిన కొత్తలో ప్రతివారమూ శమంతకి ఉత్తరాలు రాస్తుండేవాడు ఆదిత్య — ఆఫీస్ అడ్రసుకు ఆమెనుండి సమాధానాలూ — అరుదుగా — వస్తూవుండేవి నాలుగు ఉత్తరాలకి ఒక్క జవాబు — అదీ క్లుప్తధోరణిలో! అయినా తను మానేవాడు కాదు ఆమెకు భవిష్యత్తుమీద ఆశలు రేకెత్తిస్తూ, ప్రోత్సాహకరంగా వ్రాస్తూనే వుండేవాడు

ఈలోగా తనకు తెలిసిన స్పెషలిస్టుకు కూడా ఉత్తరాలు వ్రాశాడు — రెండు మూడుసార్లు — ఆమె ఆరోగ్యం గురించి

ట్రీట్‌మెంట్ విషయంలో తను శ్రద్ధ తీసుకొంటున్నా, పేషెంట్ అంతగా సహకరించటం లేదనీ, అయినా తను శాయశక్తులా ప్రయత్నిస్తూనే వున్నాననీ, ఏం ఫర్వాలేదనీ, ఆమెకు మరింత శ్రద్ధ తీసుకోమని వ్రాయమనీ జవాబిచ్చాడాయన

అది చదువుతూనే, శమంతకు తీవ్రంగా ఆక్షేపణ తెల్పుతూ వ్రాశాడు ఆదిత్య

రాను రాను పని అధికం కావటంతో, తీరిక చిక్కటమూ తక్కువైపోయిందతనికి అయినా నెలకు రెండు, మూడు ఉత్తరాలన్నా వ్రాస్తూనే వున్నాడు ఆమె దగ్గర్నుంచి సమాధానాలే కరవై పోయాయి

జయప్రదంగా ట్రైనింగ్ ముగించుకు స్వదేశానికి బయల్దేరిననాడు అతని మనసు పున్నమినాటి సాగరంలా వుంది ఆనంద కెరటాలు పువ్వెత్తున లేచి పడసాగాయి

'తిరిగి తన దేశానికి తనవాళ్ల మధ్యకి వెళ్లబోతున్నాడు

శమంత యింక ఆమె ఏం చెప్పినా వినేది లేదు వెళ్లీవెళ్లటంతటే, మూడు ముళ్లూ బిగించేసి, తనదాన్ని చేసుకోవాలి'

అతడి ఆలోచనలన్నీ అక్కడే పరిభ్రమించ సాగాయి

వెంటనే శమంతకు వ్రాసి పడేశాడు, ఏ రోజు బయల్దేరుతున్నదీ!

* * *

అనుకొన్న విధంగా బొంబాయి చేరగలిగినా, అక్కణ్ణుంచి మాత్రం వెంటనే బయల్దేరలేక పోయాడు ఆదిత్య స్నేహితుల బలవంతంమీద మరో రెండు రోజులు ఆగవల్సివచ్చింది మిత్రుల సందడీ, సరదాల్లో వున్నా ఆ రెండు రోజులూ రెండు యుగాలనిపించాయతడికి అక్కణ్ణుంచే శమంతకు టెలిగ్రాం యిచ్చాడు — ఏ ట్రెయిన్‌లో వస్తున్నదీ తెలుపుతూ ముందుగా అక్కడికే వెళ్లి, ఆ మరునాడు స్వంత వూరు, తల్లి దగ్గరకు వెళ్లాలనుకున్నాడు

## 17

స్టేషన్లో దిగుతూనే వెయ్యికళ్లతో గాలించాడు ఆదిత్య — ప్లాట్‌ఫారమంతా అతడూహించినట్లుగా — శమంత రాలేదు!

హాస్పిటల్, స్టాఫ్, మిత్రులూ వచ్చారు!

అంతమంది వచ్చినా అతడి నిరాశ ఆగలేదు

అందరితోనూ అన్యమనస్కంగానే మాట్లాడుతూ, బయటకు నడిచాడు

'ఎందువల్ల రాలేదు? టెలిగ్రాం అందలేదా? అందినా, యింటివద్ద తీరలేదా?

ఇన్నాళ్లకి తను వస్తే యింటివద్ద తీరిందా?

వాళ్ల పిన్ని అభ్యంతరపెట్టిందా? ఆవిడకు చెప్పాల్సినంత అవసరం వుందా?'

అన్నీ ముఖాముఖీ అడిగెయ్యదల్చుకుంటూనే, అందరినీ మర్నాడు కలుస్తానని చెప్తూ, టాక్సీ ఎక్కాడు

టాక్సీ యింటిముందు ఆగటంతోనే ఒక్క ఉదుటున దిగాడు వీలయినంత త్వరగా, లగేజీ గదిలో పారేసి, శమంత దగ్గరకు వెళ్లాలి ఆమె ఎందుకు స్టేషన్‌కు రాలేదో తెలుసుకోవాలి' అదే అతడి తపన!

గది తలుపులు తెరిచాడు

ధూళి ధూసరమైన ఆ గదిలో వూపిరాడదేమో నన్పించింది — ఒక్కక్షణం తలుపులు బార్లా తెరిచి, లోపలికి ప్రవేశించాడు ప్రవేశిస్తూనే కాళ్లకి తగిలాయి రెండు, మూడు ఉత్తరాలు — నేలమీద

'ఎప్పుడు వచ్చినవో' అనుకుంటూ వాటిని చేతిలోకి తీసుకున్నాడు అన్నిటిమధ్యా ఓ కవరు — అంటించని ఆ కవరు అతణ్ణి ఆకర్షించింది

అది అది శమంత దస్తూరీ!

ఉలిక్కిపడ్డాడు ఆదిత్య శమంత — తనకు — ఉత్తరం వ్రాయటమా? అక్కడికి వ్రాసిపడెయ్యక, యిలా, యిక్కడ ఎందుకు పడేసినట్లు? ఆమె వూళ్లో లేదా?

గబుక్కున బయటకు నడవబోయి, మళ్లీ కవరు తెరిచి ఆగాడు కాగితాలు బయటకులాగి, దుమ్మునిండిన ఆ ఛైర్లోనే కూలబడ్డాడు ఆత్రంగా విప్పాడు —

"ఆదిత్యబాబూ!

నన్ను క్షమించండి వెళ్లిపోతున్నాను"

'ఎక్కడికి? ఎక్కడికి శమంతా?' ఆందోళనగా అనుకుంటూ — కళ్లను అక్షరాలమీదకు పరుగెత్తించాడు —

" మీకు అక్కడికే వ్రాద్దామనుకొన్నాను కానీ, యుక్తమనిపించలేదు దేశానికి ఉపయోగపడే ఉద్దేశ్యంతో శిక్షణ పొందుతున్న మిమ్మల్ని — నా విషయాల్తో వికలమనస్కుల్ని చేసి, డిస్టర్బ్ చేయటం నాకిష్టంలేదు

అందుకే, యిక్కడికి వచ్చిన వెంటనే మీకు విషయం తెలిసేటందుకే, యీ ఉత్తరం ఇక్కడుంచుతున్నాను

మీరు వెళ్లినప్పట్నుంచీ నాకిక్కడ మనశ్శాంతి నిజంగానే కరువైపోయింది ఏ ధైర్యంతో మిమ్మల్ని సాగనంపానో, నాకే అర్థంకాని పరిస్థితి ఏర్పడిపోయింది

ఇంటిదగ్గరున్నంతసేపూ నాన్నలేని యిల్లు బోసిపోతూ మనసుని కర్తవ్య విమూఢంగా మారుస్తుంది చెప్పుకు తనివితీరా ఏడ్చే దిక్కుకూడా లేకుండా, మిమ్మల్నీ సాగనంపేశాను!

కనీసం, పిన్ని నాదయినా ఒకరికొకరు తోడయ్యేవాళ్లం! కానీ, ఆమెకు నాకన్నా చుట్టుపక్కలి అమ్మలక్కలే ఎక్కువ తన దుఃఖాన్నీ, బాధల్నీ వారితోనే పంచుకుంటుంది అందులోనూ నామీది నిష్ఠూరాలే ఎక్కువ అయినా నేను భరించాను అసలు, లెక్కచెయ్యలేదు

ట్రీట్‌మెంట్ తీసుకుంటున్నాను

ఆ టాబ్లెట్లనీ, మందుల్నీ చూసి 'ఏమిటని' తరిచి, తరిచి ప్రశ్నించసాగింది ఏదో ఆరోగ్యం బాగాలేదు, కడుపులో నొప్పి, మంట అని చెప్పాను 'ఇదని' మాత్రం చెప్పలేదు ఆమె కర్థంకాదు — అనవసరంగా కంగారుపడి భయపడుతుంది! అసహ్యించుకుంటుందేమోనని జంకాను

పథ్యాలు చెయ్యటం అసలు కుదరలేదు

వంట చేయుటమేకాక, రెండుపూటలా రెండు రకాలుగా చేసిపెట్టగల ఓపిక ఆవిడకూ లేదు — తీరిక నాకూ లేదు!

అందువల్లనేమో, రోజు రోజుకీ బాధ ఎక్కువ కాసాగింది డాక్టర్‌గారుకూడా అదే అన్నారు —

"ఆదిత్య మళ్లా ఉత్తరం వ్రాశాడు — క్షేమం గురించి నువ్వేమో, యింత అశ్రద్ధ వహిస్తావు ఇలా ముదరబెట్టుకుంటే, తర్వాత చాలా కష్టం" — అంటూ మందలించారు!

**జరిగిన కథ 7** ధనలక్ష్మి కొడుకు ఆదిత్య డాక్టరు శమంత తండ్రి బలరామయ్యగారికి గుండెజబ్బు ఆదిత్య వైద్యం ప్రారంభిస్తాడు శమంత సంపాదనపై ఆధారపడాల్సి వచ్చినందుకు బాధపడుతూంటారు బలరామయ్యగారు మేనకోడలు శమంతను వివాహం చేసుకోవాలనుకుంటాడు ఆనంద్ స్త్రీ వ్యక్తిత్వాన్ని గుర్తించని ఆనంద్ శమంతకు నచ్చడు శమంత ఆరోగ్యం దెబ్బతింటుంది ఆమెను వివాహ మాడ్తానని ఆదిత్య ఆమెకు తెలియజేస్తాడు శంకరం గొలుసును దొంగిలిస్తాడు తండ్రితో పోట్లాడి యింట్లోంచి వెళ్ళిపోతాడు గుండెపోటు ఎక్కువై బలరామయ్యగారు చనిపోతారు ఆదిత్య ఫారిన్ వెళతాడు




"ఏం చెయ్యను ? నాకు అతీతమైన పరిస్థితు ఎకి నేనెంతవరకూ బాధ్యురాల్ని ?

ఏమైనాకానీ, యీ మూడు, నాలుగు నెలలేగా ! ఆ తర్వాత మీరొస్తారు అక్కడితో అన్నీ చక్కబడతాయి

అదే నా ఆశలకు ఆలంబన ! నా జీవితానికి ఊపిరి !"

'అవును శమూ ! నే నొచ్చేశాను ఇంక నీకు ఊపిరీ, సర్వమూ నేనే ఔతాను ! '

మళ్లీ ఉత్తరంలోకేసి చూశాడు

" కానీ, నా కంత అదృష్టం లేదు ఆదిత్యబాబూ ! పుట్టుకతోనే దురదృష్టాన్ని కట్టుకు పుట్టిన అభాగ్యురాల్ని !

గత నాలుగు రోజుల్నుంచీ కడుపులో ఒకటే మంట — భరించరాని బాధ ! ఆఫీసుక్కూడా శలవు పడేశాను !

ఏది తిన్నా భగ్గున కడుపులోనుంచి, గుండెల వరకూ మంట ! ఊపిరి వదుల్తుంటే మంటలు బయటకు చిమ్ముతున్నాయేమో ననిపిస్తోంది ఎంత తక్కువ తిన్నా అరగటంలేదు !

నిన్న మధ్యాహ్నం భోజనమయిన దగ్గర్నుంచీ మరీ భరించలేకపోయాను వుండి, వుండి రెండు మూడు సార్లు వాంతులు కూడా అయ్యాయి

అంత బాధా పడుతున్నా, పిన్ని సానుభూతి కైనా పల్లెత్తుమాట కూడా అన్లేదు పైగా, ఆమె చూపులు, అసహ్యంతో — ఏహ్యంతో కూడిన ఆ చూపులు — నన్ను మరింత బాధపెట్టాయి మనసులోనే ఏడ్చుకు, వూరుకున్నాను

సాయంత్ర మౌతున్నకొద్దీ యిక భరించలేక పోయాను డాక్టర్ దగ్గరకు వెళ్దామనుకున్నాను లేచి, అతికష్టంమీద డ్రెస్ చేసుకున్నాను

"ఎక్కడికే బయల్దేరావ్ ?" గుడ్లురుముతూ అడిగింది పిన్ని

"డాక్టర్ దగ్గరకు పిన్నీ, తమ్ముణ్ణి కాస్త తోడు పంపుతావా ?" అన్నాను నెమ్మదిగా

"ఎంతకు తెగించావే ! ఆయన భాగోతానికి, నోరు మూసుకు ఆ మింగుతున్న మందులేవో మింగక, మళ్లీ డాక్టర్ దగ్గరకు బయల్దేరావా ?" అంది నాకేమీ అర్థం కాలేదు

"ఏమిటి పిన్నీ నువ్వనేది? తెగించట మేమిటి?"

అయోమయంగా అడిగాను

"ఇంకా దబాయించకే! ఆడ జన్మమెత్తి, ఆ మాత్రం అర్థం చేసుకోలేననుకున్నావా, నువ్వు పడే ఆ బాధేమిటో?

సిగ్గులేక యింకా డాక్టర్‌చేత చెప్పించుకు, మన కుటుంబాన్ని పూర్తిగా బజార్న పడేద్దామనుకుంటున్నావా?"

విషయం అర్థమయిన నాకు, ఒక్కసారిగా మతి చలించినట్లైంది! ఎంత నీచంగా ఆలోచిస్తోంది పిన్ని!

"పిన్నీ! విషయం తెలియకుండా నోటికొచ్చినట్లు వాగకు!"

అంత రౌద్రంగా, అంత పరుషంగా పిన్నితో మాట్లాడటం నా జన్మలో అదే మొదటిసారి — ఆఖరుసారికూడాను! ఆవిడ — తల్లిలాటి ఆవిడే — నామీద అంతటి అభాండాన్ని వెయ్యటం నా సహనానికి పరీక్ష అయింది

"ఏమిటీ ఆ అరుపులు? నలుగురూ పోగవ్వాలనా? సిగ్గులేదూ? అవున్లే నీకింకా సిగ్గేమిటి? బరి తెగించినదానివి" ఆవిడకూడా గొంతు పెంచింది

ఇరుగు — పొరుగులు గబగబా పోగయ్యారు విందుకి

"ఏమయింది సావిత్రమ్మా?" అంటూ

"ఇంకా ఏం కావాలమ్మా? నా కొంప ముంచింది యీ పాపిష్టిది! అందుకే ఆడదానికి బజారు చదువులూ, ఉద్యోగాలూ వద్దన్నాను

ఇప్పుడు దీనికి కడుపులో నొప్పి, వాంతులూ నట! కానీ, అదంతా ఏదో ఉత్తుత్తి రోగమే నుట! నమ్మమంటానే చెప్తోంది!

డాక్టరు దగ్గరకని బయల్దేరింది — ఆదేమే, అనవసరంగా రట్టుచేసుకుంటావూ? అని నేనంటే, యిలా విరుచుకుపడుతోంది

అంతా నా ఖర్మ! ఆయనలా పోవటం — నేనిక్కడ మిగలాల్సిరావటం —

మా అమ్మో, నాన్నో అవాళే అన్నారు, ఎదిగిన కుంపటితో వంటరిగా ఎలా వేగుతావే అని!

'విన్నానుకాదు'' —

మ్రుచుపాగనే నిప్పుగా ప్రచారంచేసే అమ్మలక్కలు — మంట ఈనబడ్డాక యిక ఆగుతారా?

తలో మాటా అనసాగారు

ఆ మాటలు — నేనిక్కడ వ్రాయలేను

ఆ అవమానం — నేను భరించలేను

అయినా, మరో దిక్కులేదు చెప్పుకునేటందుక్కూడా! అందుకే, మచ్చుకి వ్రాస్తున్నాను—

"అయితే, ఏదో చాటుబాగోతం సాగించిందన్నమాట!"

"అందుకే పెళ్లి వద్దంది మరి!"

"రంకు సాగితే పెళ్లెందుకులే!"

"అవునూ ఆ కుర్రడాక్టరు కనబట్టంలేదే యీ మధ్య?"

"ఇంకెందుకు కనబడతాడే"

ఆ మాటలతో నాకు భరించలేని ఆవేశం కట్టలుతెంచుకు వచ్చింది

"... జన్మము కావూ? విషయం తెలియకుండా, సాట స్త్రీ నన్నైనా లేకుండా, ఎంత మాటపడితే అంత మాటంటారా?

ఇంత కుళ్లు మనసుల్తో ప్రవర్తిస్తారా?"

అంటూ విరుచుకుపడ్డాను

"పదండి డాక్టర్ దగ్గరకు నిరూపిస్తాను నా కున్న రోగ మేమిటో" — అన్నాను

"ఛీ ఛీ సిగ్గుమాలినదానా! ఇంకా అరుపులు కూడానా? ఉన్న మాటకే వులుకెక్కువయిందే! నడు లోపలికి" అంటూ, నన్ను బలవంతాన లోపలకు నెట్టింది పిన్ని

కళ్లు తిరిగి నిస్త్రాణగా మంచంమీద పడిపోయాను బయటి మాటలు లీలగా వినిపిస్తూనే వున్నాయి

'రేపు నన్ను ట్రీట్ చేస్తున్న డాక్టర్ని తీసుకు వచ్చి, వీళ్ల నోళ్లన్నీ మూయించకపోతానా' అన్న భరోసాతోనే కన్ను మూశాను

* * *

ఎలా పిలిపించిందో, ఎలా వచ్చారో తెలియదు గానీ, ఇవేళ మధ్యాహ్నానికల్లా వచ్చారు మా పిన్ని తల్లీ, దండ్రీ!

వస్తూనే 'పంచాయితీ' చేశారు — యిరుగూ పొరుగుతో కలిసి

నన్ను నానా మాటలూ అన్నారు!

నేను ఎదురు తిరిగాను నిజం తెలియకుండానే నానా మాటలూ వాగేబదులు డాక్టర్ దగ్గరకు నడవమన్నాను

జ్ఞానం లేని పశువుల్లాటి మనుషులు ఆదిత్య బాబూ, వాళ్లంతా!

"బరితెగించినదానివి, నీకు డాక్టర్‌తో అబద్ధమాడించటం వో లెక్కాటే? ఆ కుర్రడాక్టరు స్నేహితులందరూ, నీకూ స్నేహితులే అయుంటారు —" అన్నాడా ముసలాయన!

ఆ 'స్నేహితుల'న్న పదంలో ఎంత వ్యంగ్యం!

పదునైన బాకు ఒకటి తీసుకు, వాళ్లందరినీ— అనవసరంగా, వాళ్లకు చిన్నమెత్తు అపకారమైనా చెయ్యని నా బ్రతుకులో నిప్పులు పోస్తున్న వాళ్లందరినీ — కస కసా కసిదీరా పొడిచేయాలనిపించింది!

ఆలంబనలేని ఆడదాన్ని చూస్తే ఎంత అలుసు వీళ్లందరికీ! ఆడదానికి ఆడదే శత్రువని నాకూ అనుభవమైంది!

"ఇహ ఒక్క క్షణంకూడా యిక్కడ వుండనూ వద్దు ఆ పాపిష్ఠిది తెచ్చే — అడ్డమయిన సంపాదనలూ తింటూ బ్రతకనూవద్దు"—పిన్ని (!) నీ, ఆమె పిల్లల్నీ!

ఆ రాత్రికే, యింటి వాళ్లతో చెప్పేసి, అంతా వెళ్లిపోయారు!

దేవుడిచ్చిన వరంలాటి మిమ్మల్ని, ఏవో 'నావను' కున్న స్వార్థం కోసం తిరస్కరించినందుకు నాకు సరయిన ఫలితం లభించింది! చెప్పుతో కొట్టి, చెరగని ముద్ర వేసి మరీ నిష్క్రమించారు వాళ్లు

ఆ వెనకే యింటావిడ వచ్చింది — రేపుదయానికల్లా ఏ సత్రం చూసుకునైనా సరే, యిల్లు ఖాళీ చేయాలనీ, బజారు మనుషులకి యిల్లు ఆలంబన చేయటం తనవల్ల కాదనీ స్పష్టీకరించి వెళ్లి

"యుగసంధ్య" త్వరలో ప్రారంభం! —సం

అయిపోయింది! అనుకోని విధంగా నా బ్రతుకు సర్వనాశన మయిపోయింది!

ఇంకాఎందుకు, ఏం చూసుకు బ్రతకాలినేను?

'నా కోసం' అంటారు మీరు

కానీ — నా కిష్టంలేదు

ముందు, మీరు తిరిగి వచ్చేదాకా యీ మనుషుల మధ్య, యీ కాకిపోట్లు తింటూ బ్రతకలేను

మొండిగా బ్రతికినా —,

ఒక గౌరవనీయమైన ఉన్నత పదవి నలంకరించటానికి వస్తారు మీరు సంఘంలో మీకుండే స్థానమూ, పేరూ, ప్రతిష్ఠలు ఉన్నతంగానే వుంటాయి

అటువంటి మీరు, నన్ను కట్టుకుంటే — మీ పరువు మర్యాదలు నాకు రావు — నా భ్రష్టత్వమే మిమ్మల్నీ నవ్వులపాలు చేస్తుంది

మీకు నామీద నమ్మకమున్నా, మీ అమ్మగారు నన్ను అనుమానించవచ్చు! సహజం!

నా అవమానాల్నీ, అవహేళనల్నీ మీకూ పంచాలి!

జీవితాంతం అవన్నీ భరిస్తూ, యిద్దరం కలిసి బ్రతకటం బహుదుర్భరం ఆదిత్యబాబూ! క్రమంగా నామీద మీ ప్రేమనుకూడా కరిగించెయ్యగలదు ఆ పరిణామం!

ఒద్దు! మీ మీదున్న అపారమైన ప్రేమ నన్నా పని చేయనివ్వట్లేదు అందుకే, యీ యిల్లే కాదు — యీ రాత్రితో ఈ లోకమే విడిచి వెళ్లిపోతున్నాను

నిశిరాత్రి దయ్యంలా కూర్చుని వ్రాస్తున్నానిది — విషయాలు మీకు వివరంగా తెలియాలని!

నాన్న వాడుతుండే నిద్రమాత్రలు — పాపం — యిన్నాళ్లుగా వాడేవారు లేక, అలాగే పడున్నాయి ఇక వాటికా వంటరితనం అవసరంలేదు

నా మాట మర్చిపొమ్మని, కన్నీటితో అర్థిస్తూ— మీ — శమంత

'శమంతా' వెర్రిగా అరుస్తూ ఆ సోఫాలోకే వొరిగిపోయాడు ఆదిత్య

ఆ వాతావరణమూ, ఆ మనుషులమధ్య ఒక్క క్షణంకూడా వుండలేననిపించిం దతడికి ప్రయత్నించి ట్రాన్స్‌ఫర్ చేయించుకున్నాడు—

మద్రాసు వచ్చేశాడు

వర్తమానంలో కాక, జ్ఞాపకాల్లో బ్రతకటం అలవాటు చేసుకున్నాడు పూర్తిగా!

(ఇంకా వు

# *** సినిమా విశేషాలు ***



"సొగ్గాడు"లో జయసుధ

## వయసొచ్చిన పిల్లగా చంద్రకళ

మగవాడెన్ని తప్పులు చేసినా మన్నిస్తుంది ఈ ప్రపంచం. కానీ ఆడది తప్పు చేయకపోయినా, చేసిందంటూ ప్రచారం చేస్తుంది ఈ పాడులోకం. అమాయక స్త్రీలపై అత్యాచారాలు జరుపుతుంటారు కొందరు కిరాతకులు. వారి కబంధ హస్తాల్లో నలిగిపోయే అబలలు ఎందరో! అలాంటి మగువల కన్నీటిని తుడిచే నాథులు ఎందరున్నారు ఈ సంఘంలో! అనే సత్యాలకు ప్రతీకగా నిలిచే చిత్ర కథే కృషీవలా ఫిలింస్ (ప్రై.) లిమిటెడ్‌వారి "వయసొచ్చిన పిల్ల" చిత్రం.

వయసొచ్చిన పిల్లగా చంద్రకళ చక్కగా నటించింది. లక్ష్మి పాత్ర గురించి ఇక చెప్ప పనిలేదు. ఎలాంటి పాత్రనైనా సునాయాసంగా చేయగల నేర్పు తనకుందని మరోసారి నిరూపించింది లక్ష్మి. చిత్రంలోని మిగతా పాత్రలను గిరిబాబు, మురళీమోహన్, శరత్‌బాబు, ఎస్. రంగారావు, ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య, పద్మనాభం, త్యాగరాజు, పవన్‌కుమార్, పొట్టిప్రసాద్, కె. కె. శర్మ, డా. శివరామకృష్ణయ్య, వల్లం నరసింహారావ్, త్యాంబాబు, వీరభద్రరావు, కాకరాల, పి. జె. శర్మ, కాశీనాథ్ తాతా, రాఘవేంద్రరావు, జి. వరలక్ష్మి, నిర్మల, కె. విజయ, సుశీల, శోభ, అపర్ణ, దేవిరోహిణి, బాలసరస్వతి పోషించారు.

వెంపో వ్రాసిన ఈ కథలో టెంపో ఎక్కడా చెడిపోకుండా చిత్రాన్ని చిత్రిస్తున్నారు దర్శకుడు లక్ష్మీదీపక్. టి. చలపతిరావు సంగీతం, శేఖర్—సింగ్ ఛాయ, జి. వి. సుబ్బారావు కళ, జె. కృష్ణస్వామి కూర్పును సమకూర్చిన ఈ చిత్రానికి పి. వి. సుబ్బారావు నిర్మాణ నేతృత్వం చేస్తున్నారు. రెడ్డి వెంకటరెడ్డి సమర్పించే ఈ చిత్రానికి కె. మురహరిరావు, పి. రామిరెడ్డి నిర్మాతలు.

## దంపతులుగా నాగేష్, రోజా

శివాజీ ఆర్ట్స్ నిర్మిస్తున్న "పూర్ణమ్మ కథ" చిత్రంలో నాగేష్, రోజారమణి దంపతులుగా నటిస్తున్నారు. నాగేష్ ఒక గొడ్లకాపరి, ఏమీ తెలియని అమాయకుడు. రోజా గుణవతి, శీలవతి, మేధావి. విధివిలాసంగా వీరిద్దరూ భార్యాభర్త అయ్యారు. తాళి కట్టిన మగని కర్తవ్యపరాయణుడిగా తీర్చిదిద్దడానికి అష్టకష్టాలు పడుతుంది రోజా. తను అన్నగా భావించే పాలేరు రాముడితో తనకు అక్రమ సంబంధం అంటకట్టినా, మనస్సాక్షిని నమ్మిన మగువ కనుకనే సహించి వూరుకుంది. తన ఆశయాల వంతెనతో విజయం సాధించింది. ఇదే "పూర్ణమ్మ కథ" వృదంతం.

సహజత్వానికి సమీపంగా వుండాలనుకునే దర్శకుల్లో కె. వి. నందనరావు ఒకరు. అందుకే గ్రామీణ వాతావరణం కోసం ఆంధ్రదేశం తరలివెళ్ళి, కోటప్పకొండ తిరునాళ్ళను, కర్రసాములు, పండరిభజనల లాంటి వాస్తవిక జానపద కళా రూపాలను, రాష్ట్ర స్థాయిలో నిడుబ్రోలులో జరిగిన ఎడ్ల పందాలను, పొన్నూరు హనుమాన్ ప్రత్యేకతను, చిలకలపూడిలోని క్షీరపండరి సముద్ర స్నాన దృశ్యాలను నేత్రపర్వంగా షూట్ చేశారు నందనరావు, వారి సాంకేతిక పరివారం.

పై చిత్రంలో నటించిన ప్రతి ఒక్కరిది ఒక ప్రత్యేకమైన పాత్ర. గ్రామసీమలోని పాలేరున గుర్తుకు తెచ్చేవిధంగా హీరో రామకృష్ణకు పాలేరు రాముపాత్ర దొరికింది. పాలేరుగా అతని నటన ప్రైజింగ్‌గా వుందన్నారు దర్శకులు నందనరావు. రోజారమణిది మణిలాంటి పాత్ర. పూర్ణమ్మగ రోజా పరిపూర్ణంగా నటించిందట. నాగేష్ తన డైలాగులు తానే మాట్లాడాడట. గ్రామాల్లో లిటిగెంట్లు ఎలావుంటారు అనే నిజానికి ప్రతిబింబంగా అల్లు రామలింగయ్య పాత్ర అమరిందట. "చింతచచ్చినా, పులుపు చావలేదు" అనే సత్య వాక్యానికి వుపమానంగా ప్రభాకరరెడ్డి పాత్ర నిలిచిందట. ధూళిపాళది చురుకైన పాత్ర. స్వార్థం, అసూయ ఆడదానికి దగ్గరిచుట్టాలు అనే నైజానికి సాక్ష్యంగా ఛాయాదేవి విధవరాలి పాత్రలో కనిపిస్తుందట.

నందనరావు నిర్దేశకత్వంలో చక్కగా తయారౌతున్న ఈ చిత్రానికి మద్ది బసవరాజు, తుమ్మపూడి నాగేశ్వరరావు నిర్మాతలు.

## విజయా ప్రొడక్షన్స్!

మాణిక్యాల్లాంటి చిత్రాలను అందించిన ఆంధ్రుల అభిమాన సంస్థ విజయా ప్రొడక్షన్స్. ఈ సంస్థ నిర్మించే చిత్రంపట్ల, ప్రేక్షకులకు ప్రత్యేకమైన ఆసక్తి వున్నది.

"కృష్ణ—జయప్రద" ప్రధాన జంటగా, జగ్గయ్య, జి. వరలక్ష్మి, పద్మనాభం, రమాప్రభ ముఖ్య పాత్రధారులుగా నటిస్తున్న విజయా ప్రొడక్షన్స్‌వారి తాజా సాంఘిక చిత్రానికి బాపు దర్శకుడు.

ఈ చిత్రానికి పద్మరాజు రచనను, పెండ్యాల సంగీతాన్ని, సుందరంబాబు ఛాయను, కృష్ణారావు కళను నిర్వహిస్తున్నారు.

నవరసభరితమైన కథను గొనియున్న ఈ చిత్రానికి నాగిరెడ్డి—చక్రపాణి నిర్మాతలు.



"పూర్ణమ్మ కథ"లో ఒక సన్నివేశం


లాక్మే
ఎక్సోటికా
టాల్క్ ప్రశస్తమైన ఆ పరిమళం ఘుమ ఘుమ
ఘుమ చిరకాలమూ ఘుమ ఘుమా ఘుమ ఘుమా ఘుమ
ఘుమా ఘుమ ఘుమా ఘుమ ఘుమా ఘుమ
లాక్మే

## దేవుడే దిగివస్తే...

వాహినీ పదకొండవ ఫ్లోర్‌లో గీతా ఆర్ట్స్ వారి షూటింగు జరుగుతున్నదని తెలిసి, నేను వెళ్ళాను.

నే వెళ్ళినప్పుడు కృష్ణుడు, సాక్షాత్కరించాడు. బలే ముద్దుగా కనిపించాడు. కలియుగ ధర్మాన్ని గూర్చి వివరణ చెపుతున్నాడు. డబ్బుతో అన్నీ సమకూరగలవని అనుకుంటె, పరితపించవలసి వస్తుందని, హితబోధ చేశాడు. కృష్ణుడు పాత్రకు రామకృష్ణ సరిపోగలడనిపించింది.

బిజీగావున్న దర్శకుడు దాసరిని కలిశాను. చిత్రానికి పేరు మార్చినట్టు చెప్పారు. "కలియుగ కృష్ణుడు" మకుటంకన్నా "దేవుడే దిగివస్తే" సరైనదని నారాయణరావు అన్నారు.

ఈ చిత్రంలో సత్యనారాయణ అపురూపమైన పాత్రను పోషిస్తున్నారు. వెరైటీ వేషం వేస్తుగ్గా చెయ్యగల ఒకే నటుడు సత్యనారాయణ అని నిరూపించగల పాత్ర ఆయునది.

"దేవుడే దిగివస్తే" చిత్రంలో అల్లురామలింగయ్య, చంద్రమోహన్, లక్ష్మీకాంత్, వాణి సహాయ పాత్రధారులు. సత్యనారాయణ సహధర్మచారిణిగా దేవిక నటిస్తున్న ఈ చిత్రంలో జయప్రద నాయిక. ఈ చిత్రాన్ని అల్లు అరవింద, దాసరి సత్యనారాయణమూర్తి నిర్మిస్తున్నారు.

## దేవిక చెప్పిన విషయాలు

తెలుగు చిత్రసీమ గర్వించదగ్గ ఉత్తమ కళాకారిణి దేవిక. ఈవిడ తెలుగులో ఎక్కువ చిత్రాలు నటించకపోయినా, చేసిన పాత్రలన్నిటా సెహభాష్ అనిపించుకొనియున్న నిజాన్ని ఎవరూ కాదనలేరు.

"దేవుడే దిగివస్తే" సెట్లో దేవికను కలిసినప్పుడు కొన్ని విషయాలను ఆవిడ చెప్పింది.

త్వరలో తన రెండవ చిత్రం ప్రారంభం కాగలదని, ఆ చిత్రంలో "హీరో—హీరోయిన్" రెండూ తనేనని చెప్పింది. దర్శకత్వం పట్ల తనకు ఆసక్తివున్నా, ఆ బాధ్యతను స్వీకరించడానికి విముఖత వున్నట్టు వెల్లడించింది.

ఎవరు చెయ్యాల్సిన పని వాళ్ళు చేస్తే, ఫలితం నిరుత్సాహంగా వుండదన్న ఆమె వాదంలో అసత్యం అగుపించదు.

## పుణ్యంకొద్దీ పురుషుడు

"చందన" చిత్రాన్ని నిర్మించి, దర్శకత్వం నిర్వహించిన బండారు గిరిబాబు జె. జె. ఫిలింస్ బ్యానర్‌ను స్థాపించి, తొలి కానుకగా "పుణ్యంకొద్దీ పురుషుడు" అనే చిత్రాన్ని తలపెట్టారు.

ఈ చిత్రం షూటింగు బెంగుళూరు కంఠీరవా స్టుడియోలో జరుగుతూవుంది. ఇప్పటికి ఏడురీళ్ళు తయారైంది.

ఈ చిత్రానికి రా. వి. శాస్త్రి కథ, మాటలను రాశారు. సంగీతానికి రమేష్‌నాయుడు, నారాయణ అయ్యంగార్ ఛాయాగ్రహణానికి, హరి కూర్పుకు, రంగారావు కళకు అధిపతులు.

చిత్రంలోని ముఖ్య పాత్రలను జయంతి, రంగనాథ్, అల్లురామలింగయ్య, విజయభాను, కె. వి. చలం, మాడా, సుధీర్, గోకిన రామారావు, యూన్నీ పోషిస్తున్నారు.

"తప్పులు చెయ్యడంలో ఎందరో ఆరితేరిన విద్యావంతులు వుండొచ్చునేమోగాని, త్యాగం చెయ్యగల ధీమంతులు కొద్దిమందే గలరు" అనేది అంశంపై అల్లబడిన కథే "పుణ్యంకొద్దీ పురుషుడు" చిత్రం.



"పుణ్యంకొద్దీ పురుషుడు"లో జయంతి

## అక్కా - చెల్లెళ్ల పోటీ నృత్యం

అనంతలక్ష్మి కంబైన్స్‌వారు "ఈ కాలపు పిల్లలు" చిత్రాన్ని నిర్మిస్తున్నారుగదా! ఆ చిత్రంలో జ్యోతిలక్ష్మిది ఒక డ్యాన్సు, ఆమె చెల్లెలు



'గజలక్ష్మి చిత్రంలో ఒక దృశ్యం

## సినిమా

జయమాలినిది వేరొక డ్యాన్సు వున్నది. ఇద్దరూ ఒకర్ని మించి మరొకరు చేశారు. అక్క చేసినది జానపద నృత్యం, చెల్లెలు చేసినది వెస్టరన్ నృత్యం.

దగ్గుపాటి భాస్కరరావు నిర్మిస్తున్న "ఈ కాలపు పిల్లలు" చిత్రానికి పి. లక్ష్మీదీపక్ దర్శకుడు.

### ప్రభకు ప్రమాదం

"ఈ కాలపు పిల్లలు" చిత్ర నాయిక, వర్ధమాన తార ప్రభకు పెద్ద యాక్సిడెంట్ జరిగింది. పరిగెత్తే కారు బోర్లపడి, ఆమె కారుకింద పడింది. డైరెక్టర్ లక్ష్మీదీపక్ సమయానికి ఆ స్పాటుకు వచ్చియుండకపోతె, ఆమె పని "గోవింద" అయ్యుండేది. విలన్ దేవదాసుకు, కెమరామెన్, రామకృష్ణకు చిన్న గాయాలు తగిలాయి. ఇప్పుడందరూ మామూలు మనుషులయ్యారు.

ప్రభకు యిది రెండవ గండం. రెండుసార్లు ప్రాణాపాయంనుండి బయటపడింది గాబట్టి, యిక ప్రభకు అపాయం లేదు. భవిష్యత్తు బలేగా వుంటుంది.

## ప్రశ్నావళి

కె. రామలక్ష్మి

బి. పి. చెన్నూరు

సంపదతోను అధికారంతోను కొనలేనిదిఏమిటి?

★ ప్రేమించే హృదయం.

టి. వి. ఎస్. నెల్లూరు

'ప్రైవ్ అండ్ ప్రైడ్ వెయిట్ ఫర్ నో మేన్' దీనికి మీ రిచ్చే సలహా ఏమిటి ?

★ దీప ముండగానే ఇల్లు చక్కపెట్టుకోమని!

వి. ఎస్. ఆర్. విజయవాడ

ఉన్న నేర్పుని అభివృద్ధి చేసుకొందుకు దారి ఏమిటి ?

★ మీ నైపుణ్యాన్ని పెంపొందించుకుందుకు ఏకాంతం; మీ శీలం నిగ్గు తేల్చడానికి తుఫానులాంటి సంఘం -- కావాలి.

ఎస్. ఎస్. ఆర్. విశాఖపట్నం

ఈ ప్రపంచంలో యింత దుఃఖాన్ని సృష్టించాడెందు కా భగవంతుడు ?

★ పొరపాటు సోదరా, భగవంతుడు సృష్టించలేదు. నిజం వినే నిబ్బరం, నిజం చెప్పే ధైర్యం లేకపోవడమే — యీ ప్రపంచంలో సగం దుఃఖానికి కారణం.

జి. ఎస్. ఆర్. మంగళగిరి

మీ సిద్ధాంతాలు మాకు నచ్చకపోయినా మీ సమాధానాల శీర్షిక వదలకుండా చదువుతాము. కారణం ?

★ ఏముందీ, అయిష్టమైనది — మందులా ముందు మింగి ముగిద్దామన్న తాపత్రయం.

జి. ఎస్. దిప్పకాయలపాడు

మీలా శ్రోతలందరికి జవాబులు చెప్పాలని అభిలాషగా వుంది. ఎలా ?

★ ఏ పత్రికవారూ ఆహ్వానించి చెప్పమనకపోతే ఏం చేస్తావు శ్యామలా?... పోనీ దిప్పకాయలపాడు నుంచి ఓ కొత్త పత్రిక ప్రారంభించు... యీ రోజుల్లో స్వంత పత్రిక వుంటే — హాయిగా నీ కిష్టమైనవన్నీ రాసుకోవచ్చు... (నీ అచ్చు కాని కథలు, నవలలు వేసుకోవచ్చు. నీ కిష్టంలేని వాళ్లని దుమ్మెత్తి పోయవచ్చు. నీ సిద్ధాంతాలని ప్రచారం చేయవచ్చు. నీ కిష్టమైన రచయితలని... బ్రహ్మాండంగా పైకి తీసుకురావచ్చు. 'మా సంపాదకీయం బ్రహ్మాండం, మా రాతలు — నభూతోనభిష్యతి' అంటూ స్వంత డబ్బా వాయించుకోవచ్చు... యిన్ని అవకాశాలు వుంటాయి. ఆలోచించు!)

జి. సిహెచ్. హైదరాబాదు

ఆదివారంనాడు కూడా యింటిదగ్గిర వుండని మగవారి నేమనాలి ?

★ అర్థం చేసుకోవాలి సోదరీ... ఆదివారం వస్తే యింట్లో ఆడదానికీ చాకిరీ ఎక్కువ — అంతా యింట్లోనే వుంటారు కనుక. మగవాడికీ పని ఎక్కువ — పగలంతా చీట్లాడాలి — సాయంత్రం ఆ కష్టం ఏ బారులోనో మరిచిపోవాలి.

పి. బి. హెచ్. ఎల్. ఏలూరు

మీపై చాలామంది పురుషులకు ద్వేషం ఎందుకు ? తమలో గుట్టుగా దాచుకొన్న రహస్యాలను పైకి తీసి రట్టు చేస్తున్నారనా ?

★ కాదు సోదరీ, అలా కుండ బద్దలుకొట్టినట్టు కాదు — నాజూకుగా చెప్పకూడదా కాస్త మసిపూసి మారేడు చేస్తే ఏం ? అని! అదీ ద్వేషం కాదు. ఒళ్లు మంట.

ఎస్. ఎస్. ఎస్. విజయనగరం

దేశ భవిష్యత్తుపై మీ అభిప్రాయం ?

★ రాజకీయవేత్తల భవిష్యత్తు బాగానే వుంది గాని... దేశం భవిష్యత్తే... కొంచెం అనుమానంగా వుంది నాయనా!

కె. వై. ఎస్. పెంట్లవెల్లి

నవ్యకాల నారీమణులను నాగరిక పద్ధతిని మగవారిపై అగౌరవ భావాన్ని చూస్తూంటే — నిరక్షరాశ్యులైనవార్ని పెండ్లాడడం శ్రేయోదాయకం అనిపిస్తూంది.

★ అంతకంటే కూడా పెళ్లి మానడం సుఖం కదా ? రేపా కట్టుకున్నది నాలుగక్షరాలు నేరిస్తే మీ గతేంకాను...

కె. ఆర్. ఎస్. నిజామాబాదు

మీ జవాబులు చూస్తూంటే మాకు ఒళ్లు మండిపోతూంది. నివారణోపాయం చెప్పకలరా ?

★ ఆ పేజీ తిప్పేయండి!... ఉండబట్టలేకపోతే — వెనక్కి వచ్చి చదవచ్చు.

డి. జె. పి. భువనేశ్వర్

పునర్జన్మలో కూడా మీరు స్త్రీగానే పుట్టాలని కోరుకుంటున్నారా ? ఎందుచేత ?

★ నాకు పునర్జన్మ ఉండదు - నేనేం పుణ్యం చెయ్యలేదు. తెలిసి పాపం చెయ్యలేదు. ఇక స్త్రీగానే పుట్టాను — జన్మ తప్పదంటే — ఎందుకో తెలుసా? ఈ జన్మలో నేను - సుఖంగానే వున్నాను కనుక!

మన సినిమాలలో బిగువైన కౌగిలింతలు చూపిస్తే అడ్డుపెట్టని సెన్సారు ముద్దులను అనుమతించ రెందుకు ?

★ 'వీటికంటే అవి చాలా సభ్యంగానూ మామూలుగానూ ఉంటాయి. ఇంకప్పుడు సినిమా ఏం బాగా పోతుంది ?' అనిట !!

భర్తలని అదేపనిగా సాధించే భార్యలమీద మీ అభిప్రాయం ?

★ సాధింపు వెనుక ఎప్పుడూ బాధ వుంటుంది ఎంతమంది భర్తలు భార్యలతో మనసు విప్పి కబుర్లు చెప్తారు ? ఎంతమంది వారు చెప్పే కబుర్లు వినాలనే ప్రయత్నిస్తారు? చిన్నపిల్లలు మనదృష్టినిఆకర్షించుకొందుకుఅల్లరిచేస్తారు.ఆడవాళ్లుసాధిస్తారు!

పి. పి. ఎస్. సికింద్రాబాదు

నిజమైన సంపద ఏది ?

★ సంతృప్తి నిజమైన సంపద. ఐశ్వర్యం — నిజంగాని పేదరికం.

నిర్మాత ఎం.ఎస్. రెడ్డి కుమార్తె వివాహం యిటీవల అయింది. నూతన దంపతులు రవీంద్ర, భార్గవి.







"చీకటి వెలుగులు"లో ప్రయాగశాస్త్రి, వాణిశ్రీ —— —— "అయినవాళ్లు" చిత్రంలో ఆర్. రామచంద్రరావు, మార్నీడి, సీతాలత

## రామకృష్ణకు శుభయోగం

"విచిత్రబంధం" చిత్రం ద్వారా ఒక కమ్మని కంఠం పరిచయమైన సంఘటనను కలిగించినది సామాన్యుడా? అసాధారణ ప్రజ్ఞావంతుడు అని ప్రజలచేత, పరిశ్రమచేత కీర్తింపబడుతున్న దుక్కిపాటి మధుసూదనరావుగారి ఆశీర్వాదబలంతో ఆవిర్భవించిన ఆ గాయకుని పేరు రామకృష్ణ.

చలన చిత్ర పరిశ్రమలో జరుగుతున్న రాజకీయ కుతంత్ర ఫలితంగా, రామకృష్ణకు (వర్తకు) సరైన ప్రోత్సాహం లభించలేదు. సంగీత దర్శకు లందరూ రామకృష్ణ వాయిస్‌ను మెచ్చుకొంటున్నారేగాని, అవకాశాలు యివ్వలేకపోతున్నారు. వాయిస్ మంచిదైనప్పుడు, దానిని సక్రమంగా వాడుకోవలసిన ధర్మం సంగీత దర్శకులమీద వున్నది.

మంచిని పెంచే మనుష్యులు కొందరైనా వున్నారీ చిత్ర విచిత్ర పరిశ్రమలో. విఖ్యాత సంగీత దర్శకుడు. ఆదినారాయణరావుగారు "మహాకవి క్షేత్రయ్య" చిత్రంలోని పాటలను రామకృష్ణచేత పాడించడానికి నిర్ణయించారు. రామకృష్ణకు శుభ యోగం స్టార్ట్ అయినట్టే.

## విజయలలిత వలదన్న దెందుకు?

ఒకప్పుడు ఏ చిత్రం తారాగణం విన్నా, విజయలలిత పేరు "మస్ట్"గా వుండేది. అట్టి బిజీ విజయలలిత యిప్పుడొచ్చే చిత్రాలలో అంతగా అగుపించడంలేదన్న బాధ ప్రేక్షకులకు లేకపోలేదు.

ఒకరోజున ఆమె నివసించే గిరిరోడ్డు భవనం లోకి వెళ్లాను. మరో అర్ధగంట ఆలస్యమైతే, ఆమె మైసూరుకు బయల్దేరివుండేది.

కన్నడంలో రెండు చిత్రాలలో కథానాయికగా నటిస్తున్నట్టు ఆవిడ ద్వారా తెలుసుకొన్నాను.

"తెలుగులో వలదన్న చిత్రాలను గూర్చి ప్రస్తావిస్తూ, విజయలలిత అంటె వాంప్ వేషం వేస్తే బాగుంటుంది అని అభిప్రాయపడినవాళ్లకు "నో" అనడం జరిగింది, అని చెప్పింది.

మంచి పాత్రలను పోషించాలన్న తపన, తాపత్రయం ఆమెకు ఎంతగా వున్నదో వివరించింది.

ప్రస్తుతం "వేములవాడ భీమకవి, ఆరాధన, మా యింటి దేవుడు, స్వామిద్రోహులు, ఉత్తములు" చిత్రాలలో వైవిధ్యంవున్న వుత్తమ కథా పాత్రలను పోషిస్తున్నట్టు చెప్పింది.

## సరికొత్త జానపదం

గత వారం ప్రముఖ నిర్మాత విఠలాచార్యను వారి యింటివద్ద కలిశాను. ఆయన నిర్మించబోయే జానపద కథను టూకీగా చెప్పారు. "సరికొత్త శైలిలో సాగే కథ" అనిపించింది.

నేను కథ వింటున్నప్పుడు, యిద్దరాజానుబాహు లొచ్చారు. ఆ యిద్దరే దర్శకత్వం నిర్వహించగలరని ఆచార్య చెప్పారు. ఒకరి పేరు విశ్వనాథన్. రెండవ వ్యక్తి పేరు వైకుంఠ రామశర్మ.

కథను విఠలాచార్య రాశారు. జి. కె. మూర్తి రచనకు సారధ్యం వహిస్తున్నారు. హీరోగా రామకృష్ణ నటించగలరు. మూడు ముఖ్యమైన స్త్రీ పాత్ర లున్నాయని చెప్పి, వాటికి నూతన తారలను పెట్టాలన్న వుద్దేశ్యం వున్నట్టు ఆచార్య చెప్పారు.



"వయసొచ్చిన పిల్ల"లో చంద్రకళ, మురళీమోహన్

## తెలియని నిజం!

విఠలాచార్య చెప్పేంతవరకు, జయచిత్రకు (అమ్మాజీ కుమార్తె) మొట్టమొదట స్క్రీన్ టెస్ట్ చేసింది, ఆ ఎడిటెడ్ రషస్‌ను చూచి, గోపాలకృష్ణన్ ఆమెను వెండితెరకు పరిచయం చేసింది, తెలియని నిజంగా దాగివున్న దింతకాలం. ఆమె ఆచార్యకు కృతజ్ఞతను చెప్పాలనుకొంటున్నది.

## ఎంత మధురమైన పాట!

ఈమధ్య పుండరీకాక్షయ్యగారి "నిగమశర్మోపాఖ్యానం" రేడియోలో విని ముగ్ధుడ్నై అయ్యాను. ఆయన్ను అభినందించడానికి వెళ్లాను. ఆయన తన చిత్రంలోని పాటలను "టేప్" మీద వింటున్నాను. "మీకు అభ్యంతరం లేకపోతే నేనూ మీ పాటలను వింటాను" అంటూ వినసాగాను.

టేప్‌లో వున్న అయిదు పాటలను విన్నాను. అయిదూ బాగున్నాయి అని చెప్పడానికి నేను సంశయించడంలేదు.

నన్ను ఎక్కువగా ఆకర్షించిన పాట ఒకటుంది. అదేమిటన,

"వేడే తెలిపింది ... ఈనాడే తెలిసింది
కమ్మని కథకే రూపంవస్తే
నీలాగే వుంటుందని" అనెడి రఫీ — జానకి

పాడిన యీ డ్యూయెట్టును నామటుకు నేను యిరవైసార్లు విన్నా తనివితీరదాయె! డాక్టర్ నారాయణరెడ్డి విరచితమైన పై పాటను "నటరత్న — వాణిశ్రీ" మీద చిత్రీకరిస్తారు. ఈ చిత్రానికి బి. వి. ప్రసాద్ దర్శకుడు.

— శ్రీనివాస్

# హైక్లాస్ కోరిక

యం. మహేశ్వర్

ఎదురొచ్చే గాలిని తోసుకుంటూ వచ్చిన సైకిలు మీద నుంచి దిగాడు రామారావు.

ఇంట్లో అడుగు పెడుతూనే, గాజు గ్లాసుల మోత గుండె — లదిరేలా వినిపించింది. ఈ వేళ నాశనమైందో అనుకుంటూ బూట్లిప్పకుండానే వంటింట్లోకి ప్రవేశించాడు. ఏముంది తమ చిన్న సుపుత్రుడు బెల్లం డబ్బా కోసమని వేట ప్రారంభించాడు యింట్లో తల్లి లేదుకదా అని. బెల్లం డబ్బా సంగతి దేవుడెరుగు, ముందు అరడజను గ్లాసులు వరుసగా వకదాంట్లో ఒకటి పెట్టివున్నాయి, వొక్కటీ మిగలకుండా టపాకాయల్లా పేలిపోయాయి. ఆఫీసులో పనిచేసి అలిసివచ్చిన కోపంతో నాలుగు తగిలించాడు. వాడు తగిలిన రెండు దెబ్బలకే తల్లి దగ్గరకు కడుపు పట్టుకొని పరుగుతీశాడు.

కాసేపటికి, "కాసేపెక్కడికైనా వెడితే చాలు యిల్లు గోల అయిపోతుంది" అంది క్రింద పడి ఉన్న గాజుముక్కల్ని ఎత్తుతూ సావిత్రి.

"అయినా గాజు వస్తువులు అంత అజాగ్రత్తగా పెట్టడమేమిటి తప్పంతా నీది" అన్నాడు షర్టు గుండీ లిప్పుతూ, రామారావు.

"అవునులేండి మీరామాటంటారని నా కెప్పుడో తెలుసు, నాలుగు నెలలనుంచీ అవక్కడే వున్నాయి. ఈ వేళంటే ఆ వెధవ బెల్లం కోసమని తగలేశాడు."

"అవి అసలు అప్పుడే పగిలేవి. నిన్న కొట్టు కెళ్ళి బెల్లం తేవడం, అది డబ్బాలో వేయడం, దాన్ని వాడు చూస్తూండగానే వాటి వెనకాల పెట్టడం ఈ రోజు పగలడానికి కారణం."

"పోయిన వస్తువు తిరిగిరాదు. యింక ఆ సంగతి వదిలేయండి."



"వదిలేయకేం చేస్తాంలే, మొన్న మీ చెల్లెలి కొడుకు బంగారంలాంటి అద్దాన్ని పగలగొట్టినప్పుడూరుకోలేదా, మీ తమ్ముడుగారి సుపుత్రుడొచ్చి అలారమ్ టైమ్‌పీస్‌లో ఏ భాగానికి ఆ భాగం వూడదీసినపు డూరుకోలేదా" అంటూ వరుసగా చెప్పుకొస్తున్న భర్త మాటకి,

"ఇంక ఆపండి బాబు, మా వాళ్ళు మన యింటికి రావడం యిష్టంలేదని ఒక్క ముక్కలో చెప్పకూడదూ" అంది.

"వచ్చినందుకు నేనేమనటల్లేదు సావిత్రి, వచ్చినపుడు పిల్లల్ని జాగ్రత్తగా చూడాలి. అంతగా చూడలేకపోతే పిల్లల్ని యింట్లో పెట్టి తాళం వేసి రావాలి, లేకపోతే వాళ్ళలా వస్తువుల్ని పాడుజేస్తే మళ్ళీ మనం అంతంత ఖరీదుపెట్టి కొనగలమా చెప్పూ."

"చెప్పడం తేలికండి, పిల్లలు చిన్నపుడు కాక పోతే అల్లరి మరెప్పుడు జేస్తారండి. ఇంకా వీళ్ళు నయమే, మీరు చిన్నపుడు చేతిలో ఏ వస్తువుంటే అది విసిరికొట్టేవారట."

"ఊ... ఈ విషయం నీ కెవరు చెప్పారేమిటి" అన్నాడు చేసిన తప్పును కప్పిపుచ్చాలని ప్రయత్నిస్తూ.

"మీ అమ్మగారే"

"చచ్చాంరా భగవంతుడా" అనుకొని, "ఈ విషయం పెద్దగా అనకు మనవాడు వింటే తగలేయడానికి ఈ రోజే ప్రారంభోత్సవం చేస్తాడు."

"అన్నట్టు ఈ గొడవల్లోపడి మీకు కాఫీ యివ్వడమే మరిచిపోయాను" అంటూ ఫ్లాస్కు లో కాఫీ కప్పులో పోసి భర్త కందించింది.

"ఏమండి నిన్న మన యింటివాళ్ళు 'కృష్ణవేణి' సినిమాకి వెళ్ళారట, చాలా బావుందిట." అంది వాలు కుర్చీలో కూర్చుని కాఫీ త్రాగుతున్న భర్తతో.

"అయితే ఏమిటంటావ్, వెళ్దాంలే యిప్పుడు చాలా రద్దీగా వుందని మా స్నేహితుడొకడన్నాడు, అది నువ్వన్నట్లుగా బావుంటే యిప్పుడప్పుడే పోదు ఒక వేళ పోతోం దంటే ఆ సినిమా చూసేట్టుగా వుండుండదు."

"సరేలేండి మీ యిష్టం", అంటూ భర్త

# అంజయ్య కష్టజీవి. పాపం!
# దినమంతా కష్టపడ్డా, తిండికి చాలదు.

అంజయ్య దర్జీషాపులో జీతానికి పనిచేస్తాడు.
మంచి పనికాడు. రాత్రనక పగలనక పనిచెయ్యాలి.
నెలంతా కష్టపడితే తనకు దొరికేది రు.250 లు
మాత్రమే. తనకూ ఆశలున్నాయి. ఆ మాటకు
వస్తే ఆశలేని వా డెవడు ?
సొంతగా ఒక దర్జీషాపు పెట్టుకోవాలని,
అందరికి తన పనితనము చూపి, పేరు, డబ్బు
సంపాదించాలని ఆశ. భార్యా పిల్లలు కళకళ
లాడుతుంటే చూడాలని ఆశ.
ఆశ ఆశగానే నిల్చిపోయింది.
మనసులో క్రుంగి పొయ్యాడు.
మంచి రోజులు ఎప్పుడో...

ఏం ఫరవాలేదు. ఆశలు నిజమవుతాయి.
ఎలా ! ఎవరు ఆదుకొంటారు ?

**ఎవరో కాదు.**

*అందుబాటున ఉన్న మన*
*ఆంధ్ర దేశపు భాగ్యలక్ష్మి*




ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ లాటరీ

డైరెక్టర్ ఆంధ్రప్రదేశ్ స్టేట్ లాటరీ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము హైద్రాబాదు-500001

Kalpa/apsl/8/75 tg/a

## నమ్మా నమ్మకపో

- ★ జిరాఫీ నిల్చొనే నిద్రపోతుంది కూర్చుని నిద్రపోతే దాని శత్రువు వచ్చినపుడు తొందరగా లేవలేదుగనక
- ★ మనం నిత్యం చూసే సినిమాలో ఒక సెకను మనం చూసే బొమ్మ — (24) యిరవయి నాలుగు విడి విడి బొమ్మల కలయిక
- ★ ఖడ్గమృగం ముక్కుమీద వుండేది నిజంగా కొమ్ము కాదు జడలు కట్టిన కొన్ని రోమసముదాయం —సి లక్ష్మి

త్రాగిన కాఫీ కప్పునందుకొని వంటింటి ముఖం పట్టింది

* * *

రామారావు గుమాస్తా వచ్చే జీతం సరిపోక తనకు తెలిసిన హోమియో వైద్యం చేస్తుంటాడు దానిమీద ఆదాయం ఎంత వచ్చినా చూసేవారికి గుండె ఆగినంత పనయ్యేది తన జీతం, ఈ ఆదాయం కలిపి సంసారాన్ని నెట్టుకొస్తూ వుండేవాడు ఆడదానికి నగలమీద, బట్టలమీద ఆశెక్కువంటారు, అట్లాగే సావిత్రికి కూడా మొదట్లో చీకాకుపడినా చివరికి భార్య కోరికను తీర్చేవాడు భర్త పిల్లలు ముగ్గురైనా ఆ యింటిని కురుక్షేత్రంగా మార్చగలిగే సమర్థులు అద్దె కొంపల్లో తల దాచుకునే మధ్య తరగతివారైనా ఏం చేసినా గుట్టుగా కనిపించాలని భార్య, మనం చేసేది దొంగతనమా గుట్టుగా వుండటానికి అని భర్త, ఈ విషయంలో వారి కెన్నోసార్లు మాటా మాటా వచ్చాయి వీరు ఏ వస్తువు కొన్నా చూసేవారికి బాధగానే వుండేది ఇంటివారు అది తెలియగానే అద్దె కాస్త పెంచడం, బంధువులు వీళ్ళకేమిటి వీళ్ళు బాగనే వున్నారు కదా అని రకరకాలుగా అనుకునేవాళ్ళు ఎవరేం అనుకున్నా లెక్కచేసేవాడు కాదు రామారావు

ఒకసారి సావిత్రి విపరీతమైన కడుపునొప్పితో బాధపడుతుంటే తన మందులను వేసి చూశాడు కానీ ఫలితం లేకపోయింది ఇంటి మందులు యింటివారికి పనిచేయవని హాస్పిటల్‌లో చేర్చాడు ఇంట్లో పిల్లల సంగతి, హాస్పిటల్‌లో భార్య సంగతి, ఆఫీసులో తన సంగతి చూసుకోలేక దగ్గరలోనే వుండే సావిత్రి అక్కగారికి రమ్మనమని కబురు చేశాడు కానీ అతని కబురుకి విలువ లేకపోయింది కారణం 'నేనొచ్చి అక్కడ కూర్చుంటే యిక్కడ నా సంసారం ఏంగానూ' అని చీటీ వ్రాసి పంపింది తమ అత్తగారు దగ్గరున్నా కనీసం చూడటానికైనా వెళ్ళ లేదు

ఆ మాట రామారావు గుండెల్లో చెరగని ముద్ర వేసింది ఏమీ తోచక ఆలోచిస్తున్న అతను, చివరికి స్నేహితుడు కృష్ణమూర్తిగారికి కబురు చేశాడు వెంటనే అతను తన భార్యతోసహా వచ్చి అవసరం తీరాక వెళ్ళిపోయారు అప్పటినుంచి రామారావుకి బంధువులకంటే మిత్రులే నయం అనిపించింది

* * *

ఆరోజు ఆదివారం కారణం రామారావుకి గంటలు నిముషాల్లా గడిచినట్లనిపిస్తున్నాయి

"ఏమండీ ఈవేళ శలవుకాబట్టి 'కృష్ణవేణి' సినిమా కెళదామండి" ఆశగా అంది సావిత్రి

"శలవురోజున మనకి టిక్కెట్లు ఎలా దొరుకుతాయే" అన్నాడు భర్త

"సినిమా వచ్చి అరవైరోజులయింది ఇంకా దొరక్కపోవడమేమిటండి, అయినా శలవురోజు కాకపోతే మీకెపుడు తీరుబడి అవుతుంది ఆఫీసున్న రోజుల్లో అయితే మీకూడా యింటికి ఓ పేషంట్‌ని తీసుకొస్తారు ఈ రోజు ఎవరూ రారుకదా అని అడిగాను మీయిష్టం'

"సరే అయితే నడవండి, సైన్యమంతానా ?" అన్నాడు

"పెద్దవాడయితే ఎప్పుడో చూసేశాడు ఇంక మిగిలింది యిద్దరేగా, వాళ్ళా వస్తామని వారం నుంచి గొడవచేస్తున్నారు"

"ఇంక పెద్దవాడికి పనేముంది మిగిలినవాళ్ళ వస్తామని అంటున్నారు అంటున్నావు ఈ ప్రోగ్రాం వారంక్రితమే నాకు తెలియకుండా సెటిల్ చేశావన్న మాట, అప్పుడే ఒంటిగంటవుతోంది త్వరగా తెములు"

"మనమెళ్ళేది మ్యాట్నీకా ?"

"కాదు ఫస్టు షోకి, మ్యాట్నీకయితే ప్రొద్దుట కాఫీ త్రాగే బయలుదేరేవాళ్ళం"

"అయినా, యింత ముందేమిటండి బహుశా ఆ థియేటర్లో మనమే వుంటామేమో"

"ముందేమిటి, నీ బట్టల సెలక్షన్ అరగంట, కట్టుకోవడం గంట, పిల్లల్ని ముస్తాబు చేయడం గంట, మీ పెద్దాడికి అప్పగింతలు అప్పజెప్పడం గంట, బస్సుదగ్గర వెయిటింగు రెండు గంటలు, ఊ ముందూ వెనుక ఆలోచించక త్వరగా తెములు"

పనులన్నీ పూర్తి చేసుకొని తయారైయ్యేటప్పటికి నాలుగయింది ఇంతలో ఆ టాక్సీ చప్పుడు వీరి చెవిన బడింది అరగంట ముందే తయారై బ్యాండు మేళం డ్రస్సులో వున్న తమ యిద్దరు పిల్లలు లోపలికి పరిగెత్తుకుంటూ వచ్చారు "అమ్మా పిన్నొచ్చింది" అన్నారు బూటు త్రాడు బిగించుకుంటున్న తండ్రి వులిక్కిపడేలా చేతిలో బ్యాగ్ నాడించుకుంటూ "ఏమండోయ్ బావున్నారా" అంటూ లోపలికి ప్రవేశించింది రామారావు మరదలు రూపాదేవి టాక్సీలో వున్న పెట్టె, బెడ్డింగు పట్టుకొని లోపలపెట్టాడు, రామారావు తమ్ముడు మోహనరావు

"అన్ని సామాన్లు తెచ్చినట్లేగా, ఇంకా టాక్సీ వాడు అక్కడే వున్నాడేమిటి ?" అన్నాడు మనసులో దాగియున్న సినిమా కోరికను చంపుకుంటూ రామారావు

"ఆ అన్నట్టు మరచాను నీ దగ్గర అయిదు రూపాయలుంటే యిద్దూ టాక్సీవాడి కివ్వాలి, నా దగ్గర అయిదే వుంది మిగిలింది చిల్లరగా లేదు" అన్నాడు

"అలాగా" అంటూ అయిదు రూపాయలున్నా యివ్వకుండా తప్పించుకుందామని, "నా దగ్గర పది రూపాయల నోటే వుందిరా" అన్నాడు

"పరవాలేదన్నయ్యా పదిరూపాయలే అయింది" అంటూ ఆ పది రూపాయల నోటును అందుకున్నాడు

నిరాశగా నోటును జారవిడిచిన రామారావు "పిల్లలేరిరా" అన్నాడు

"టాక్సీ సరదా తీరలేదట్టుంది, వాళ్ళింకా టాక్సీలోనే వున్నట్టున్నారు" అంటూ టాక్సీ దగ్గరి కెళ్ళాడు మోహన్

డబ్బిచ్చి టాక్సీవాణ్ణి పంపించి, పిల్లల్ని తీసుకొని గదిలోకొచ్చి వాలు కుర్చీలో వాలాడు 'హమ్మయ్యా' అంటూ

పాపం 'సినిమా కెళుతున్నాం కాస్త మా యింటిని చూస్తూ వుండండి' అని చెప్పడానికి ప్రక్కింటి కెళ్ళినట్టుంది ఇంట్లోకి రావడంతోటే క్షణంసేపు భయంతోనిస్తేజ అయిపోయిందిసావిత్రి

"ఏం వదినా అలాగే వుండిపోయేవు ?" అన్నాడు మోహన్

సావిత్రి సంగతి తెలుసుకున్న రామారావు "మీరు యింత కాలానికి వచ్చారు కదా, అయినా యిదివరకొచ్చినప్పుడు ముగ్గురే వచ్చారు యిపుడు అయిదుగురయ్యారు కదా, అందుకని" అని సర్దేశాడు

"వీడు మీకు తెలుసు నంబర్ 'వన్' శీనుగాడు, వీడు నంబర్ 'టూ' మధు, నంబర్ 'త్రీ' గోపి" అని చెప్పుకొస్తున్న రామ్మోహన్‌తో "నంబర్ ఫోర్'ని వచ్చేసారొచ్చేటప్పటికి పేరు పెట్టి తీసికొస్తావన్న మాట అనగానే "లేదురా 'త్రీ' తోటే ఫుల్‌స్టాపు పెట్టించేశాను" అన్నాడు నవ్వుతూ

వీళ్ళిలా మాట్లాడుతుండగానే రూపని లోపలికి తీసికెళ్ళింది సావిత్రి

"మీ వాలకం చూస్తుంటే ఎక్కడికో బయిలుదేరబోతున్నట్టున్నారే" అన్నాడు మోహన్

"ఏం చెప్పాలో తోచక, సినిమా అంటే యింకా టైముంది మేంగూడా వస్తామంటే నా పర్సు పూర్చడమే కాకుండా అది అమ్మాల్సి వస్తుందేమో అని మనసులో అనుకొని "ఆ ఏం లేదురా బజారు కెళదామనుకున్నాం" అన్నాడు.

"అయితే ఆలస్యం దేనికి అందరం వెళదాం నడవండి" అన్నాడు

గుండాగినట్లయింది రామారావుకి కానీ ఏం చేస్తాడు తమ్ముడి బలవంతంతో బయలుదేరక తప్ప లేదు పర్సు పూర్చే యోగం అనేదుంటే ఎలాగయితేనేం

వారం రోజులు గడిచాయి

"ఇంకమేం వెళదామనుకుంటున్నాంఅన్నయ్యా" అన్నాడు చావు కబురు నెమ్మదిగా చెప్పినట్లు

అలాగే అన్నాడు వాళ్ళనెపుడు ఎలా వదిలించుకోవాలా అని ఎదురుచూస్తున్న రామారావు

ఆ మాట అన్న నాలుగు రోజుల తరువాత కదిలింది తమ్ముడి సైన్యం

( 47వ పేజీ చూడండి)




# స్వస్తిక్
# పెర్‌ఫ్యూమ్డ్ కేస్టర్ హెయిర్ ఆయిల్

## ఒత్తుగా, నిగనిగలాడే, ఆరోగ్యకరమైన కేశముల కొరకు



రోజంతా మీ కేశములను దువ్వినవి
దువ్వినట్లే ఉంచేందుకు—స్వస్తిక్ పెర్‌ఫ్యూమ్డ్
కేస్టర్ హెయిర్ ఆయిల్‌ను మీ
కుటుంబంలోని వారందరూ మెచ్చుకుంటారు.
నేటి నుండే వాడడం ప్రారంభించండి.

స్వస్తిక్ హౌస్‌హోల్డ్
అండ్ ఇండస్ట్రియల్
ప్రోడక్ట్స్ లిమిటెడ్

Shilpi shsp 2A/75 tel




## కనకతార

(16వ పేజీ తరువాయి)

"ప్లీజ్! ఇవాళ్టికి ఇక్కడే వుండిపోకూడదూ?" అన్నాను బెరుగ్గా

ఆమె నన్నుచూసి తీయగా నవ్వింది అబ్బ! ఆ నవ్వు ఎంత హాయిగా వుంది?

"ఉంటే, నాకేం ఇస్తావ్?"

ఏం ప్రశ్న అది? ఏం సమాధానం చెప్పను? "ఏమైనా ఇస్తాను ఏమడిగినా ఇస్తాను ఐవిల్‌గివ్ మైసెల్ఫ్!"

ఆమె నా చెయ్యిని ప్రేమగా నొక్కింది నా ఒళ్లు ఒక్కసారి ఝల్లుమంది "ఇప్పుడు కాదు రామూ, ఈమాట తర్వాత చెప్పు!"

శ్రీరామ శంకరం నాపేరు అత్తయ్య నన్ను శంకరం అని పిలుస్తుంది అత్తయ్య లాగే మిగిలిన అందరూనూ, కానీ "రామూ!" అని కనకతార పిలవడం, నా హృదయ తంత్రుల్ని ఒక్కసారి జలదరింప చేసింది

"వెళ్దాం డియర్, ఆలస్యం అయిపోతోంది!" పానకంలోపుడకలాగా చారుదత్తుడు

"త్వరగా?" నా గొంతులో ఒక వేడికోలు బలహీనత

"వర్షంలో ఏం వెళ్తారయ్యా?" ముసలి కంచు కంఠం.

"దారంతా బురద బురదగా వుంటుంది" కరణంగారి హెచ్చరిక

"కార్లో వచ్చినవాళ్లకు వాన ఓ ప్రాబ్లమ్ కాదు కార్లో కూచున్నవాళ్లకు బురద కనుపించదు" కనకతార జవాబు

వాళ్లు వెళ్లిపోయారు గదిలో ఒక్కసారి చీకటి ఆవరించినట్లయింది

ఆ రాత్రి నాకు భోజనం సయించలేదు. భోజనమైంతర్వాత ఓ అరగంటు సేపు బాతాఖానీ వేయడం మా మావయ్యకు అలవాటు. ఆపలించడం, గడియారంకేసి చూడడం వంటి పన్నులు చేసి, వాళ్ల దగ్గర్నుండి బయటపడి మేడమీద నా గదికి చేరుకున్నాను

గది కిటికీలు తోడ్డు వేపుకు వున్నాయి అప్పటికి వర్షం వెలిసింది. పుచ్చపువ్వులా వెన్నెల ఆకాశంలో ప్రేమ జ్వరాన్ని అందరికీ పంచి పెట్టే చంద్రుడు ఇంటి గుమ్మానికీ, బయట గేటుకూ మధ్య ఏపుగా పెరిగిపూచిన నైట్‌క్వీన్ పూల పరిమళం . గాలి మెల్లగా వీస్తోంది బుజ్జగిస్తున్నట్టు

నాకు నిద్ర రావటంలేదు డీ కెమరాస్

# కనకతార

కథలు చదివాను. అసహ్యమనిపించాయి కనకతారే కళ్ళముందు కనుపిస్తోంది

ఆమె మెళ్ళో వేసుకున్న ఎర్రరాళ్ళనెక్లెస్, చేతులకు పెట్టుకున్న గోరింటాకు సన్నని నడుము లేత పాదాలు, నునులేత పెదిమలు, చెమర్చే కళ్ళు, ముంగురులు అల్లలాడే ఫాలతలం, వాడిపోని యౌవనం ప్రత్యంగంలో కళ్ళముందు కనుపిస్తున్న కనకతార నన్ను కలల ప్రపంచంలోకి నడిపించుకుని వెళ్ళింది నా మెడచుట్టూ చెయ్యివేసి ప్రేమగా దగ్గరకు తీసుకుంది

"రా రాముా, ఇంకా దగ్గరకు రారామూ!"

ఆమె ప్రక్కన నేను కూచున్నాను నా చేతిలో వున్న స్టీరింగ్‌వీల్ నా కెంతో డిగ్నిటీని ఇస్తోంది ఆమె రాసుకున్న ఫ్రెంచి అత్తరు మెత్తగా, లలితంగా నాగుండెలనుస్పృశిస్తోంది నేను ఆమె కళ్ళవేపు మెడవైపు, మెడ క్రిందుగా

"డియర్! డియర్! స్పీడ్ తగ్గించవూ!"

నా చేతిలో కారు విమానమైంది నేను మేఘాల్లోకి దూసుకు పోతున్నట్టుగా ఫీలవుతున్నాను

"రామూ! రామూ! స్పీడు తగ్గించు రామూ, రామూ—ప్లీజ్!"

ఒకసారిగా ప్రపంచం మేలుకున్నట్లు, నా కల తిరగబడినట్లు అయింది గదిలో దీపం ఇంకా వెలుగుతూనే వుంది నాగడియారంలో చిన్నముల్లు పన్నెండు మీద వుంది బయట చీకటిగా వుంది ఆకాశం నల్లగా వుంది నా పేరే నాకు తిరిగి, తిరిగి వినబడుతోంది

నేను నమ్మలేక, ఒక్కసారిగా నా మంచం మీద నుండి క్రిందకు దూకి కిటికీ దగ్గరకు వచ్చాను బయట గేటు దగ్గర కనకతార! ఆమె నన్ను పిలుస్తోంది ఆమె నన్ను చెయ్యి జాచి పిలుస్తోంది వివర్ణమైన ఆమెుహంలో తెర్చుకున్న ఆనోరుభయంతో పాలిపోయికన్పిస్తోంది

"అక్కర్లేదు తారా! నువ్వేమి నాకు చెప్పనక్కర్లేదు అంతా నాకు తెలుసు. వస్తున్నాను వచ్చేస్తున్నాను. ఒక్క క్షణం."

నేను మేడమీదనుండి క్రిందకు దూకాను కాళ్ళకు చెప్పులు వేసుకున్నానో లేదో నాకు తెలీదు బయట చలి. కాళ్ళక్రింద బురద. కానీ ఎదురుగా కనకతార! ఆమె నన్నుచూసి నిశ్వసించింది నేను రావడంచూసి నాకన్నా ముందు నడిచింది ఆమె తలమీదుగా నీటి బిందువులు ఆమె దేహం మీదుగా ... జారి పాయును ఆమె నడవడంలేదు పరుగెత్తుతోంది నేను వెనకబడ్డాను నాకళ్ళు తడబడుతున్నాయి "రామూ! రామూ! రా రామూ! ప్లీజ్ తొందరగా!"

రాళ్ళల్లో, బురదలో చేలకు అడ్డంపడి, మొక్కలు తొక్కుతూ, జారుతూ నేను నడుస్తున్నాను పరుగెత్తుతున్నాను కాలు జారిపడి, బెణికి, బాధతో ముందుకు అడుగు పెడుతున్నాను

ఆమె నాకోసం ఆగడంలేదు విడిచిన బాణంలా ముందుకు వెళ్ళిపోయింది ఆమె పమిటచెంగు ఆ అందమైన భుజాలమీద నిలవడంలేదు సుకుమారమైన ఆ కాళ్ళు భూమి మీద నడవడంలేదు

నడచి నడచి, రోడ్డు మలుపు తిరిగితే వాళ్ళ కారు కనిపించింది అది ఒకవైపుకు పడిపోయి వుంది గోతిలోవుంది ఏంజరిగిందో నాకు తెలిసిపోయింది బురదలో చక్రాలు జారిపోయాయి స్టీరింగ్ వీల్ కంట్రోలు తప్పిపోయింది కారు ముందుభాగం ఎలక్ట్రిక్ స్తంభానికి గుద్దుకొంది చారుదత్తుడి మొహం పచ్చడైపోయింది అతనిఒకచెయ్యికుడివైపుడోరులోనుండిబయటకు వ్రేలాడుతోంది.

"హలో! హలో!" అతని వేళ్ళ్ళు కొద్దిగా కదిలాయి చారుదత్తుడి శరీరం పట్టుకు చూశాను కొంచెంవేడితగులుతోంది మెడనిండా చారికలు కట్టిన రక్తం, అప్పటికి గాని మళ్ళీ నాకు కనకతార జ్ఞాపకం రాలేదు జ్ఞాపకం వచ్చిచూస్తే వెనకాల సీట్లో, డోరుకు దగ్గరగా జీవచ్ఛవంగా కనకతారగుట్టగా కిందపడివుంది అంత దగ్గరగా చావును చూడడం; ఒక మనిషి చనిపోయింది మరొక మనిషి చనిపోతున్నాడు నాగుండె వివశమైంది

దయ్యాలబండి ఏదో స్టేషన్లో ఆగినట్టుంది అంతరాంతరాలలోనూ జనం బిలబిలమంటూ పెట్టెలోకి ఎక్కేస్తున్నారు. జనం, జనం, గోల, గోల, పిల్లల ఏడ్పులు, పెద్దల సతాయింపులు, బయట వర్షం, తెపల్లో ఎదురుగా నిద్రపోతున్నవాళ్ళ కలవరింతలు నా మనసులో తెలియరాని భయం, నామీద జనం పడుతున్నారు. నన్ను నెట్టేస్తున్నారు "ఏమండీ? ఏమండీ?" నాకు ఇంతవరకు కథచెప్పిన ఆ పెద్దమనిషి కోసం చేతులు జాపాను ఆయన కూచున్నచోటు ఖాళీగా తగిలింది జనాన్ని అటూ యిటూ నెట్టి, ఖాళీచేసుకుని ఆయనకోసం నాకళ్ళు వెతికాయి ఆయన అక్కడ లేడు!!

# ఈ వేసవిలో ఎక్కడ చెమట పేలుడు సంభవిస్తుంది?

నుదురు

మెడ

బుజాలు

చేతులు

వీపు

ఎక్కడ పేలినప్పటికి, జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరుతో అరికట్టండి ఒక్క జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరు మాత్రమే 3 రకాలుగా పనిచేయు ఋజువైన ఔషధీయుక్త ఫార్ములా కలిగియున్నది

- చెమటను పీల్చుకొని, చర్మముల రంధ్రములను మూసివేయుటను అరికడుతుంది.
- క్రిముల పెరుగుదలను నిరోధిస్తుంది.
- చల్లదనం, హాయిని చేకూర్చి తక్షణ ఉపశమనము చేకూరుస్తుంది

స్నానము తదుపరి మరియు నిద్రపోవుటకు ముందు జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరు విరళంగా చల్లండి అది ఒక్కటే ఔషధీయుక్తమైన పౌడరు, చెమట పేలుడు నుంచి ఉపశమనము కల్గించేది—తక్షణమే.




చందనపు సువాసనతో గూడా దొరుకుతుంది.

**ఒక్క జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరు మాత్రమే మంటను ఆపుతుంది, దురదనుంచి ఉపశమనం ఇస్తుంది. తక్షణమే.**

Johnson & Johnson

# మంచిని పెంచి చూడు

**విమలా రామం**

*(గత సంచిక తరువాయి)*

''అమ్మా! నాన్నగారొచ్చేశారు
కొడుకు కేకకి ఉలిక్కిపడింది అరవింద. ఆత్రుతగా గుమ్మంలోకి పరిగెత్తింది

''అరూ!''

ఆమె గుండె గొంతుకలోకి వచ్చినట్లయింది కన్నీళ్ళయినా పొంగివచ్చాయి కాని, నోటమాట రాలేదు

''నేనే అరూ! వచ్చేశాను'' ఆమె చేతులు పట్టుకున్నాడు ప్రభాకర్

'వచ్చేసారా నాకు తెలుసు మీరు వచ్చేస్తారని నా ప్రార్థన దేవుడాలకించాడు''

ఒక్క రెండ్రోజుల్లో పిల్లలు నువ్వూ ఇలా అయిపోయారేమిటి ?'' భార్యని, బిడ్డల్ని బాహుబంధంలో ఇముడ్చుకుంటూ అన్నాడతను

''మీరు మాత్రం చిక్కిపోలేదూ!''

''ఏమిటో ఈ పీడకల అలా హఠాత్తుగా పట్టుకుపోయారు ఉన్నట్టుండి వెళ్ళి పొమ్మన్నారు మరి ఎందుకు అరెస్టు చేశారని అడిగితే — విడుదలయినందుకు సంతోషించక— మీకా వివరాలెందుకయ్యా-అని పైగా వాళ్ళ వేళాకోళం—ఏమిటో ఈ బ్రతుకులకో అర్థం అంటూ కనిపించటంలేదు'' ప్రభాకర్ నిస్పృహతో నేలమీద చతికిలపడ్డాడు



''అయ్యయ్యో! మీకు మంచినీళ్ళయినా ఇవ్వలేదు నాకు మతి మతిలోలేదు'' అని తన్ను తాను తిట్టుకుంటూ వంటింట్లోకి వెళ్ళిపోయింది అరవింద

ఆమె కాఫీ కలిపి తెచ్చేవరకు పిల్లలతో కబుర్లు చెపుతూ కూర్చున్నాడు ప్రభాకర్.

కాఫీ గ్లాసు అందుకుంటూ, 'కొన్నాళ్ళు పోతే ఈ కాఫీకూడ ఉండదు'' అన్నాడతను

''ఇంక ఆ ఉద్యోగం పోయినట్లేనా?'' అరవింద దిగులుగా అంది

ప్రభాకర్ పేలవంగా నవ్వాడు ''ఎంత పిచ్చిదానివి అరూ! ఉద్యోగంలోంచి తీసేసేవాడు కాకపోతే షాహుకారు జైలుకు పంపిస్తాడా నన్ను? మళ్ళీ వేట ప్రారంభించాల్సిందే!''

గాఢంగా నిట్టూర్చింది అరవింద

''అదిసరే, నువ్వు కాళింది దగ్గఱకి వెళ్ళావా?''

'ఆఁ! వెళ్ళాను''

''ఏమంది ?''

''మీరు విడుదలవటానికి తానే సాయపడింది'' అంటూ తలదించుకుంది అరవింద

ప్రభాకర్ పకపక నవ్వాడు ''ఈ జోక్స్ ఎప్పట్నించి మొదలు పెట్టావోయ్!''

''పరిహాసం కాదండీ నిజం! ఆమె మూలంగానే మీరు విడుదలయింది ఒట్టి దురుసుతనం తప్ప మీరనుకున్నంత చెడ్డమనిషికాదు ఆమె''

''ఏం నీకేమన్నా మత్తుమందు పోసిందా? ఇంతవరకు దాని గురించి మంచిగా మాట్లాడిన వాళ్ళని నే నెక్కడా చూళ్ళేదు'

మీారిలా మరో ఆడదాన్ని చులకనగా చూడ్డమూ నేనెప్పుడూ చూళ్ళేదు

''ఏమిటే ఆశ్చర్యం! ఈవేళ ఆవిడ వకల్తా పుచ్చుకున్నట్లున్నావు.''

''మీరు చెప్పిన మూడు కోతుల కథ అప్పుడే మర్చిపోతాననుకున్నారా ?''

''ఒకటి చెప్పు నువ్వు ఎవరికయినా ఎప్పుడయినా చెడుతలపెట్టగలవా ?

''ఉహూఁ''

''అలాగే, కాళిందిలాంటి వాళ్ళు ఇతరులకి మంచి తలపెట్టలేరు పాపం, అటువంటి వాళ్ళకు ఒకరికి మంచిచేయటం అంటే ఎలర్జీ!'' ప్రభాకర్ నవ్వాడు

# నా శ్వాసలో శ్వాసించే నా ప్రియుడు

## నను, విడిచి క్షణం

## స్వర్గంలో కూడా ఉండలేనంటాడు

నిర్మలమై, తాజా రుచి గలిగిన బినాకా గ్రీన్ నాకెంతో అవసరమైన ఆత్మ విశ్వాసాన్ని చేకూర్చుతుంది ముఖ్యంగా …తని చేరువవనున్న మధుర క్షణాలలో. …దువలనంటే, బినాకా గ్రీన్‌లో …్వసయొక్క దుర్వాసనను హరించి మీ …టికి రోజంతా హాయి గొల్పే తాజా …నాన్నివ్వగల ప్రకృతిసిద్ధమైన …ంధ-సంహారక పదార్థము, క్లోరోఫిల్ …న్నది అందు చేత బినాకా గ్రీన్ నా …కత్యంత ప్రియతమమైంది

…న్నంతగా ప్రేమించే నా ప్రియుణ్ణి కేవలం నా వాడిని చేసిన బినాకా గ్రీన్‌కు ధన్యవాదాలు




## మా గాఢ అన్యోన్య ప్రేమకు కారణం- బినాకా గ్రీన్



బినాకా టూత్ బ్రష్‌కి గుండ్రటి కొసలు ఉంటాయి చిగుళ్ళను ఏమాత్రం గాయపరచవు.

CIBA-GEIGY

Rediffusion/CG/194 e Tel

'మీలాంటి వాళ్లకు పట్టు సడలించటం ఎంత్రి!''

''మాటకు మాట అందిస్తున్నావు ఏం, కాళింది నేర్పిందా?''

''ఎంతయినా మీ మాజీ ప్రియురాలు కదా!'' అరవింద నవ్వింది

''ఏం? కాజాలు తినాలని ఉందా?''

అప్పుడప్పుటు అరవింద తల పంకించింది ప్రభాకర్ చెంపదెబ్బ వెయ్యబోయాడు ఆమె చటుక్కున అతని చేయి పట్టుకొని తన పెదవులకు రాచుకుంది ''. ఈ చేతులతో దెబ్బలు తినాలని నోకెన్నాళ్లనుంచో కోరిక!''

* * *

భుజంమీద జాకెట్టుకున్న చిరుగు కనపడకుండా చీర చెంగు కప్పుకుంటూ ఆ గదిలోకి అడుగుపెట్టింది అరవింద

''ఆయన వచ్చేసారు నాకెంతో సంతోషంగా ఉంది మీ మేలు జన్మలో మర్చిపోలేను.'' అంది అరవింద కాళింది లోపలికి రాగానే

ఆమె నాపాద మస్తకం పరీక్షిస్తూ,

రచనలు, వ్యాసాలు, బొమ్మలు, ప్రశ్నలు మొదలైనవన్నీ పంపవలసిన చిరునామా

సంపాదకుడు,

ఆంధ్ర సచిత్ర వారపత్రిక,

గాంధీనగరం, విజయవాడ-520003

## మంచిని పెంచి చూడు

''నా మాట నేను నిలబెట్టుకున్నాను'' అంది కాళింది

అరవింద ముఖంమీద మందహాసం మాయలేదు ''అపును మీ కచ్చిన మాట నిలబెట్టుకుందామనే నేనిక్కడికి వచ్చాను, చెప్పండు''

''ఇప్పుడుకాదు''

''అలాగే! మీ యిష్టం మీరెప్పుడంటే అప్పుడు''

''ప్రభా కొట్టుకు వెళుతున్నాడా!''

అరవింద తల దించుకుంది ''లేదండి మరో ఉద్యోగం కోసం వెతుక్కుంటూ వెళ్లారు''

''ఏం? షాహుకారు రావద్దన్నాడా?''

''జైలుకి పంపించిన మనిషి మళ్లీ ఆయన్ని చేరదీస్తాడా? ఒదీకాక, ఆయన కక్కడికి వెళ్లటానికి మనస్సెలా ఒప్పుతుంది?''

కాళింది మాట్లాడలేదు

''మీరు బాధపడకండి ఏడాదికన్న ఏ ఉద్యోగం ఆయనకి నిలబడలేదు అర్ధాకలితో గడపటం, ఆశతో బ్రతకటం మా కివన్నీ మామూలే!'' అని అరవింద నవ్వింది

కన్నార్పకుండా ఆమెవైపు నిమిషంపాటు చూసింది కాళింది ఏదో సిగ్గు ముంచుకొచ్చి తల దించుకుంది అరవింద

''నిజంగా నువ్వెంతో అదృష్టవంతురాలివి అరవిందా!'' మొదటిసారిగా కాళింది గొంతులో ఎనలేని మార్దవం చవి చూసింది అరవింద

ఆమెకళ్లు వింతగా మెరిసాయి ''నిజం అందుకేనె నాకు మీ పరిచయ భాగ్యం కలిగింది''

''నువ్వందరి లాంటి దానివి కాదు నీతో మాట్లాడుతుంటే సరే, సరె నువ్వెళ్లిరా! రేపు మళ్లరా!'' అని తడబడుతూ పైకి లేచి ప్రక్కగదిలోకి వెళ్లిపోబోయింది కాళింది మళ్లీ వెనక్కి తిరిగి, ''ఓసారి మీ ఆయన్ని కూడ తీసుకు రాకూడదూ!'' అంది

''అలాగే! ఆయనకింకా ఉద్యోగం దొరకలేదుకదా! అంతవరకు స్థిమితం ఉండదు వీలుచూసుకొని తప్పకుండ తీసుకువస్తాను''

*

''ఒక్కదానివే వచ్చావు? ప్రభారానన్నాడా?''

''లెదు వారికింకా తీరిక చిక్కలేదు రెండమూడు రోజుల్లో నేనే తీసుకు వస్తాను'

ప్రక్కనున్న డ్రాయరు సొరుగు తీసి ఒక న్యూసుపేపరు కటింగ్ అరవింద ముందుకి విసిరింది కాళింది ''ఆ ఉద్యోగానికి అప్లయి చేసాడా?''

ఆ కాగితం పరీక్షగాచూసి, ''లేదనుకుంటాను'' అంది

''ఏం?''

''పేపరు తెప్పించటంలేదు'' తలదించుకుంది అరవింద

''ఏ లైబ్రరీలోనయినా చూడచ్చుకదా!''

అరవింద మాట్లాడలేదు

''సరే, అప్లయిచేయమను''

ఓక్షణం తటపటాయించి, ''ఆయనకీ తరహా ప్రకటనలమీద నమ్మకంలేదు. అయిన వాళ్ళకుకాని ప్రయివేటు కంపెనీల్లో ఉద్యోగాలు రావుట'' అంది ఆమె

''ఆ ఉద్యోగం ప్రభాకిప్పిస్తాను. నువ్వు నాకేమిస్తావు?''

అరవింద నవ్వింది

''నిజమే అరవిందా! నేను నవ్వుతాలకనటంలేదు''

''మీరిప్పిస్తారన్నందుకు కాదు...ఏమిస్తావని అడిగినందుకు!''







## మంచిని పెంచి చూడు

కాళిందికే నవ్వువచ్చింది అంతలోనే ఆమె ముఖం ముకుళించుకుపోయింది

''మిమ్మల్ని మొదటిసారి చూసినప్పుడు . ఎంతో అపార్ధంచేసుకున్నాను నిజంగా ఇప్పుడు సిగ్గుపడుతున్నాను అప్పుడుమీలో మంచితనం చూడలేక పోయినందుకు ''

ఓ క్షణం మాట్లాడలేదు కాళింది ''నిన్ను నాల్గుసార్లు చూసాను ప్రతిసారీ ఇదే చీరలో కనిపించావు నీకింకో చీరలేదా?''

'' లేదండి '' అంది అరవింద సిగ్గుతో కుంచించుకుపోతూ.

''మరి ఎలా గడపగలుగుతున్నావు ?''

అరవింద నవ్వింది ''ఇలాగంటే వారే మంటారో తెలుసా! నీకోచీర-నాకో చొక్కా లాగు అయినా ఉన్నాయి బయటపనిమీద వెళ్ళేటప్పుడు మాత్రమే కట్టుకుంటూ ఒకే బట్టతో గడిపే భార్యాభర్తలు ఈ లోకంలో చాలమందున్నారని — నాకు నిజమేననిపించింది !''

''నేనోచీర ఇస్తాను కట్టుకుంటావా?''

అరవింద నిండుగా నవ్వింది ''మీ షరతు ఇదేనా ?''

కాళింది ఉలిక్కిపడింది ''అహాఁ! అది కాదు ఊరికినే అడిగాను ''

''మీ దయివల్ల ఆయనకుద్యోగం రావాలే కాని అప్పటి హీనస్థితిలో మీముందుకి వస్తానా ? నాకేమంచిజరిగినా మీవల్ల అయినట్లు కాదూ !''

కాళింది అవాక్కయిపోయింది.

''మరి వెళ్ళిరమ్మంటారా ?

''ఊఁ !''

''మీ మేలు ''

'' మాటి మాటికి అలా అనకు ''

''మాటవరసకు అనటంలేదు అంతకన్న ఏమీ ఇవ్వలేని దానికి మాటలతో నయినా కృతజ్ఞత తెలపటం ధర్మం!''

''నీ దగ్గర ఏముందో-అదెంత విలువయినదో నాకు తెలుసు హఠాత్తుగా ఎప్పుడో అడుగుతాను అప్పుడు ''

'' క్షణం సందేహించకుండ నాకున్నదంతా మీ చేతుల్లో పెడతాను ''

[ ఇంకా వుంది ]

## ఈ సంఘంలో కుటుంబమే ఇది

( 12వ పేజీ తరువాయి )

ప్రారంభోత్సవంట నన్ను కాసేపు కూర్చోమన్నాడు అక్కడ ''

''రాముడు సెకండ్ హాండ్ బుక్‌స్టాల్ పెట్టాడా !! ఎంతమంచిపని చేశాడు !!''

'' న్నయ్య మీకీ విషయంచెప్పవద్దన్నాడు''

''ఎందుకనిట?''

''మీకు పరువుతక్కువగా ఉంటుందేమోననిట ''

నిట్టూర్చాడు గోపాలరావు

''వాడు తన స్వశక్తిమీద ఒక సెకండ్ హాండ్ బుక్‌స్టాల్ పెట్టుకున్నాడు దీని వల్ల నలుగురిలోనూ పరువుతరగదు పెరుగుతుంది అని రేపు కనిపిస్తే వాడికి చెప్పు .''

''అలాగే నాన్నగారూ ''

మనసులో ఆనందం పట్టలేక భార్యను పిలిచి తనే చెప్పాడు ఆ విషయం అంతటితో కామేశ్వరికి తన పెద్ద కొడుకును గురించి గుండెల మీద ఉన్న పెద్ద బరువు తొలగిపోయిన అనుభూతి కలిగింది

అయితే రెండోవాడు కృష్ణ . ఇల్లు వదిలివెళ్లి మూడు రోజులైంది గోపాలరావుకు జ్వరం మొదలయిన తర్వాత అతడు అలా వెళ్ళటం ఇది రెండవసారి చివరకు ఇదే చర్చనీయంగా మారింది ఆ భార్యాభర్తలమధ్య.

* * *

ఆసాయంత్రం నాలుగు గంటలప్రాంతంలో తమ ఇంటి ముందు ఒక స్కూటరు ఆగిన శబ్దం, ఆ వెంట కాలి బూట్లు టకటక-లోపలికి ఎవరో వస్తున్నారన్న సంగతి గ్రహించి లేచి కూర్చున్నాడు గోపాలరావు

ముందు అరుణవచ్చి నమస్కారం చేసి ''నాతోపాటు మా అన్నయ్యకూడా వచ్చాడు'' అంది ఆమె వెనకే ప్రకాష్ వచ్చాడు లోపలకు

ఇద్దర్నీ సాదరంగా కూర్చోమన్నాడు గోపాలరావు.

శ్యామల గది గుమ్మంలోంచి తొంగిచూసి-పట్టరాని ఆనందంతో గది రెండో ద్వారం గుండా వంటింట్లో రెండోసారి కాఫీ కాస్తూ కూర్చున్న తల్లి దగ్గరకు వెళ్లింది

[ ఇంకా వుంది ]

# మీ కాఫీని తియ్యగా చేసుకోడానికి
# ఇదొక మార్గం
# రికరీ ఇన్‌స్టెంట్‌ను కొనండి




# ఒక చంద్రిక (మీడియం) సబ్బు
# ఉచితం










ప్రతి ఒక
50 గ్రాముల
రికరీ
ఇన్‌స్టెంట్ తో

మీ ఇంటి
ఖర్చును
తగ్గిస్తుంది రికరీ

రికరీ®
ఇన్‌స్టెంట్
-ప్రత్యేక రుచితో స్పెషల్ కాఫీ

# పోలీస్ డైరీ

### ఆశ-ఆగ్రహం-అనర్థం

డయ్యూకి చెందిన ఒక పూళ్ళో పోలీసు ఇన్స్పెక్టరుగా పనిచేస్తున్న ఏంబరస్ డిసౌజా అనే అతను ఓ నర్సును చూసి, ఆమె మీద కోర్కెతో తన ఇద్దరి కానిస్టేబుల్స్‌ను విషయం చెప్పి ఆమెను సిద్ధంగా ఉండమని ఆమె ఇంటికి పంపాడట ఆ నర్సు భయపడి ఏం చెయ్యాలో తెలియక పబ్లిక్ ప్రాసిక్యూటర్ ఇంటికి వెళ్లి ఆయనరక్షణ పొందిందట దాంతో డిసౌజాగారికి కోపం వచ్చి ఆ ప్రాసిక్యూటర్ గారింటికి వెళ్లి ఆ పిల్లని దాచి తనకు ఆశాభంగం కలిగించిన నేరానికి కాల్చి చంపేస్తానని బెదరించాడట ఈ విషయం కదిలి డిప్యూటీ సూపరింటెండెంటు ఆ పోలీసు యస్ పి జోగ్ హుటా హుటిని ఆ పూరు వెళ్లాడట ఆనక ఆ డిసౌజాను గోవాకు, ఆ ఇద్దరు కానిస్టేబుల్స్‌ను డామన్‌కు ట్రాన్స్‌ఫరు చేసి, తత్కాలంగా వారిని పదవి నుంచి తొలగించారట— నో కామెంట్స్!!

### నగమింగిన దొంగ

మధురలోని ఓ ప్రింటింగు ప్రెస్సు యజమాని ఇంట్లో ఓ దొంగతనం జరిగిందట పోలీసులు అనుమానంమీద నటరాజన్ అనే వ్యక్తిని పట్టుకున్నారట కానీ అతను తానపహరించిన వెయ్యి రూపాయల నెక్లసును గుట్టుగాగుటుక్కున మింగివేశాడట పోలీసులు అతని పొట్టకు ఎక్స్‌రే తీయించి, ఆనక ఆపరేషను చేయించి, ఆ నగ తీసేసుకున్నారట వార్నీ ఇన్కమ్టాక్స్‌వారినే మించి పోయారే !

### జీతాలని మించిన అపరాధాలు !

సౌత్ ఈస్టరన్ రైల్వే బిలాసపూర్ విభాగంలో టిక్కెట్టు లేని ప్రయాణీకులు, సరి అయిన టిక్కెట్టు లేని ప్రయాణీకుల వద్దనుంచి సుమారు నెలకు లక్షా నలభయివేల రూపాయలు వసూలవుతున్నాయట ఆ విభాగంలోని రైల్వేఅధికారుల, సిబ్బందుల జీతాలు యీ అపరాధాల వసూళ్లతో చెల్లించడం అయిపోతున్నదట అక్కడ జీతాల బిల్లుకన్నా యీవసూళ్లే ఒక్కోనెలా నాలుగయిదు వేలు ఎక్కువ ఉంటున్నాయట

# డాక్టర్ సలహాలు!

డా॥ కె. వెంకటేశ్వరరావు

**టి. ఆర్ – అమలాపురం**

నా వయస్సు 16 సం॥లు నేను ఏ విషయము చదివినను చదివిన 5 ని.లకే మరిచిపోవుచున్నాను, దీనికి కారణం తెలుపుతూ నివారణోపాయము చెప్పగోర్తాను

చదివే సమయంలో దృష్టి చదువుతున్న దాని మీద కేంద్రీకరించకపోతే, జ్ఞాపకశక్తి తగ్గిందనుకోవటం, ప్రస్తుతం మీ వయస్సులో ఉన్నవారం దరూ వ్రాస్తున్నదే!

చదువుతున్న సమయంలోను, పని చేస్తున్నప్పుడు వాటిమీద శ్రద్ధ, ఆసక్తి ఉన్నప్పుడు మరచిపోవడం అన్న ప్రసక్తి రాదు

ప్రస్తుతం యువకులలోను, తదితరులకు, వారు పనిచేస్తున్నప్పుడు, ఇతర విషయాలను గురించి ఆలోచించడం సహజంగా కనబడుతున్నది జ్ఞాపక శక్తిని, మెరుగుపరచటానికి ప్రత్యేకంగా, మందులు లేవు.

**ఎస్ ఎ ఎల్ —విజయవాడ**

మా వారికి 27 సం॥ లు తలలో చుండ్రు ఉన్నది ఎక్కువగా ఉన్నప్పుడు నిమ్మరసం వ్రాస్తు న్నాము అయినా తగ్గ లేదు. పూర్తిగా పోవుటకు ఏమి వాడవలెను

తలలో చుండ్రు ఉన్నవారు నిమ్మరసం వ్రాస్తే ఎక్కువ ఫలితం కనిపించకపోవచ్చును

చుండ్రు అనేది 'డెర్మోఫైటాన్' అనే ఫంగస్ వలన ఏర్పడుతుంది, ఇలా ఉన్నవారు తలకి "సాలిసిలిక్ ఆసిడ్" ఆయింట్‌మెంట్ పూయటం, లోనికి గ్రైసోవిన్—ఎఫ్—పీ మాత్రలు రోజుకి 6 మాత్రలు (పూటకి 2) 10 రోజులపాటువరుసగా వాడటం ముఖ్యం

అయితే వాడే దువ్వెనలు, ఉపయోగించే బట్టలు పడగ గలీబులు వేరేగా ఉంచుకుని, బాగా శుభ్ర పరచి వాడితే ఇతరులకుగాని లేక తిరిగి తమకేగాని ఈ రోగం రాదు

**ఎస్ ఎల్ – నెల్లూరు**

నా భర్తగారికి 15 సంవత్సరాలుగా నడుములో నెప్పి ఉన్నది. ఇర్గాపైరిన్ మాత్రలు వేసుకుంటే తగ్గేది ఎక్స్‌రే తీసి 'అన్‌కైలోసింగ్ స్పాండిలైటిస్' అన్నారు దీనికి నివారణ ఏమిటి?

'అన్‌కైలోసింగ్ స్పాండిలైటిస్' అంటే వెన్నుపూసలు ఒకదానికొకటి బాగా అతుకుకొని సహజమైన కదలికలు లేకుండా ఉండటమే! ఇలా ఉన్నప్పుడు వెన్ను పామునుండి వెలువడే నర

ములు రాపిడిచెంది, నడుమునెప్పి, కాళ్ళ సత్తువ లేకుండా ఉండటం, వెన్నెముకలో నెప్పి ఏర్పడ తాయి

దీనికి పూర్తిగా నయం చెయ్యటానికి ప్రస్తుతం మందులు లేవు తాత్కాలికంగా మందులు వాడితే ఉపశమనం లభిస్తుంది ఇర్గాపైరిన్, 'మిల్లికార్టిన్' ఫినైల్ బ్యూటా జోన్, 'ట్రయాక్టిక్' మొదలగు మాత్రలు వైద్యుల పర్యవేక్షణలో వాడవలసి ఉంటుంది ఎక్స్‌రే కిరణములు కూడా ఇలా ఉపశమనం కలిగిస్తాయి

ఆర్ ఎం — తాడేపల్లిగూడెం.

నాకు శృంగార కలలు వచ్చినప్పుడల్లా శుక్ల నష్టం జరుగుతున్నది ఆరోజల్లా నీరసంగా ఉంటున్నది దీనికి ఏదైనా నివారణ ఉన్నదా ?

వయసులో ఉన్నవారికి, వయసుతోబాటుగా సహజంగా ఏర్పడే కోరికలవల్ల, ఇలా జరుగు

## డాక్టర్ సలహాలు

తుంది కోరికలు తీరక పోవటంవల్ల ఏర్పడేదే గాని ఏరోగంవలనాకాదు. సినిమాలు, శృంగార పత్రికలు, కథలు చదివటంవల్ల నేటి యువ తరం వారికి కోరికలు ఎక్కువ అయి, అవి తీరిక పై లక్షణాలవంటివి ఏర్పడితే ఏదోనష్టపోయా మని చివరికి బాధపడటం, అనవసరం ●

# చూశారా! మా పరీక్షా ఫలితాలు!!

ఒకటి రెండూ కాదు! ఒక ఏడాదే రెండూ కాదు!

**విజయపరంపర! మీ భవిష్యత్తుకు రాచబాట!**

మెట్రిక్ *1970* మార్చి I క్లాసులు 1825 2002 8459 93 8692 8786 8915 61 9179 82 85 96 9309 19 31 50 9620
II క్లాసులు 1289 1583 1975 8312 74 80 8461 8695 8801 21 43 8919 41 9001 9133 48 55 60 9193 67 73 74 77 78 91 99 9325 45 48 52 59 87 97 9496 9580 9842

***1971* మార్చి I క్లాసులు** 6505 6784 6858 78 6923 25 27 33 47 53 55 7026 81 89 96 99 7105 10 15 34 47 48 50 53 57 63 64 76 7272
II క్లాసులు 6606 93 6856 66 75 83

***1972* మార్చి I క్లాసులు** 3622 3922 27 78 4019 68 4102 14 4292 4333 34 68 84 85 97 4496 4528 35 93 99 4780
II క్లాసులు 3713 3925 54 61 66 71 76 82 90 4004 05 13 24 53 91 4119 4227 86 4327 41 59 63 74 77 86 95 4401 03 39 40 55 68 4529 63 85 4603 05 14 53 61 62 68 83 4805 35 92

***1973* మార్చి I క్లాసులు** 3123 3384 86 88 3405 11 12 23 68 3659 61 78 84 96 3706 18 31 34 35 37 40 50 56 57 59 3838 81 91 99 3905 09 4026
II క్లాసులు 3126 30 3389 90 3428 35 44 58 65 74 91 3517 32 43 3651 52 57 85 89 3705 3708 15 16 17 19 27 28 29 41 42 46 55 82 95 3804 13 19 31 43 54 75 80 3900 27 48 4013 52 61 75 89 4153 62 76 84 4239 67

***1974* మే I క్లాసులు.** 2019 41 2192 6648 50 7168.
**II క్లాసులు:** 2040 47 52 71 2107 08 73 2198-A 2248 2550 53 2610 6684

[ స్థలాభావంచేత III క్లాసులు వేయుటలేదు ]

ఇదే మన కళాశాల *** రవి కళాశాల * గుంటూరు-2**

5వ తరగతి మొదలు **M. A.** వరకు, ఇంగ్లీషు, తెలుగు మీడియములలో
100 మంది అధ్యాపకులు, 6 హాస్టల్సులో నడుస్తున్న అద్వితీయమైన సంస్థ

**1957 లో స్థాపితం** *** *పునఃప్రారంభం జూన్ 11 నుండి*

ఫోన్లు 20917, 21192, 21545

**C.V.N. ధన్** MA, డైరెక్టర్,

**C. ఝాన్సీలక్ష్మి** MA, B.Sc, BEd CIR, ప్రిన్సిపాల్

తెలుగు అధికార భాష

రచన శ్రీ హామీము గోపాలకృష్ణయ్య, ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా ఒ కళభాషా కమీషన్ సమర్పణ 32 పేజీలు, అమూల్యం ప్రచురణ సాధారణ పరిపాలన (అధికార భాష) శాఖ, ఆంధ్రప్రదేశ్, హైదరాబాదు

## అవీ - ఇవీ - అన్నీ

నామ రామాయణము

తాత్పర్యసహితము వ్యాఖ్యాత బ్ర శ్రీ జోశ్యుల శివరామావధాని, బాలల కోసం బొమ్మలతో ప్రచురించిన ఈ రామాయణాన్ని శ్రీ విజయ భారతి విజయవాడ—10 వారు ప్రచురించారు 16 పేజీల పుస్తకంలో లేదు వివరములకు • శ్రీ జోశ్యుల రాధాకృష్ణ, శ్రీ బసవరాజు సుబ్బారావు, కార్యకర్తలు, శ్రీ విజయ భారతి, స్టేట్‌బ్యాంక్ ఆఫీసర్స్ కోలనీ, విజయవాడ—10




**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, Mallika Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna**

# హై క్లాస్ కోరిక

(30వ పేజీ తరువాయి)

"మనమనుకున్నది వెంటనే ఎపుడూ జరగలేదు, నేనేమన్నా రత్నాలహారం కావాలన్నానా, పట్టుచీర కావాలన్నానా, ఏం పెద్ద కోరిక కోరాను?" అని సాధించసాగింది సావిత్రి

"నువ్వు ఏ కోరిక కోరలేదు బాబూ, అయినా కోరినవన్నీ యివ్వడానికి నేనేం వరాల దేవుణ్ణి కాను" అన్నాడు

"అవునులేండి, ఆ రోజు సినిమాకని ఎంతో ఆశతో తయారైన తరువాత మీవాళ్ళొచ్చినా, వాళ్ళకేమన్నా అమర్యాద చేశానా, పది రోజులపాటు పుష్టిగా మేపేను" అంది సావిత్రి

"కాదన్నానా నువ్వు ఆ సినిమా చూడటమేగా కావలసింది — తయారవు త్వరగా, అయిదవుతోంది" అన్నాడు

"మరి ఆ రోజు ఫస్ట్ షో కని ఒంటిగింటకే వెళుదామన్నారు మరి ఈ రోజూ ఆదివారమే, టిక్కెట్ల సంగతో ?"

"అది నీ కనవసరం, అయినా మూడు గంటల ముస్తాబుకి పిల్లలు సర్కసు కెళ్ళారుగా త్వరగా తయారుకా "

అరగంటలో తయారై, ఆటో ఎక్కారు పావుగంటలో థియేటరుముందు ఆగింది ఆదివారం కనుక జనం చాలామందున్నారు ఆటోవాడికి డబ్బులిచ్చి టికెట్టు కౌంటరు వైపు నడిచారు అన్ని క్లాసుల్లో టిక్కెట్లు అయిపోయాయి

మధ్యతరగతివారి రాహతుకు సరిపోయే రెండు రూపాయల కౌంటరు దగ్గర సోల్డ్అవుట్ బోర్డును చూసిన సావిత్రి గుండెలో రైళ్ళు పరిగెత్తినట్లయ్యాయి కారణం ఆ రోజూకూడా తావూ సినిమా చూడలేమేమో అని

ఒక మూడున్నర కౌంటరు వద్ద మాత్రం టిక్కెట్లు యింకా అమ్ముతున్నారని, కంగారు వచ్చి టిక్కెట్లు కొనే కొందరిని చూసి అటువైపు నడుస్తూ, జేబులోంచి పర్సును బయటకు తీస్తూ, అందులోంచి పది రూపాయల నోటును తీశాడు "అంతపెట్టి ఆ సినిమా చూడకపోతే ఏమండి" అంది సావిత్రి

"నోరెత్తకు" అంటూ రెండు టిక్కెట్లు తీసికొని మేడపైకి నడిచాడు

అంత టిక్కెట్టు కొని సినిమాకి వెళ్ళడం అదే మొదటిసారి

ఎలాగయితేనేం సినిమా చూశారు

"నీ కోరిక తీరిందా?" అన్నాడు సినిమానుండి బయటకు వస్తూ













లలితా మూవీస్ వారి

# చల్లనితల్లి

నిర్మాత:
జి. జగదీశచంద్రప్రసాద్ B.A.,

దర్శకత్వం:
కె. ఎస్. రామిరెడ్డి B.Sc.

సోల్ డిస్ట్రిబ్యూటర్స్:
అన్నపూర్ణా పిక్చర్స్

అన్నపూర్ణా ఫిలింస్ రిలీజ్

ANNAPURNA